# హెచ్చరిక



ఈ నాటకముయొక్క సర్వాధికారములు నాకు జెందియున్నవి గాన నా యొక్క లిఖితరూపకమైన ఆర్డరు పొందకుండా ముద్రించుటగాని, ప్రదర్శించుటగాని మరి యే యితర అన్యాక్రాంతము జేసినను కాపీరైటు చట్టప్రకారము శిక్షార్హాములని యిందుమూలముగా తెలియజేయుచున్నాను.

ఇట్లు

కాపీరైటు హక్కుదారుడు

**కాళహస్తి తమ్మారావు**

1936

# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు

ఉదయసేనమహారాజు—రాజు
ధీమంతుఁడు—ఉదయసేనుని మంత్రి
ప్రతాపుఁడు—సేనాధిపతి
క్రూరసేనుఁడు—ఉదయసేనుని సోదరుడు
సులోచనుఁడు—ఉదయసేనమహారాజు సేవకుడు
రామిసెట్టి—కొత్వాలు
వీరపాలుఁడు } క్రూరసేనుని మిత్రులు
శూరపాలుఁడు }
కనకసేనుఁడు—ఉదయసేనుని కుమారుఁడు
మారఁడు—దొంగలనాయకుఁడు
పల్లివాడు—కమలను రక్షించినవాడు
విజయసింహమహారాజు—ఉదయసేనుని స్నేహితుడు
సుమంత్రి—విజయసింహుని మంత్రి
ముని—కనకసింహునికి హితోపదేశమొనరించినవాడు
వీరసింగు—కమలను అడవిలో రక్షించినవాడు
భటుఁడు—విజయసింహుని ద్వారపాలకుఁడు
సువర్ణుఁడు—కనకసింహుని మంత్రి
వైద్యుఁడు—వీరసింగు కుమారుని బ్రతికించినవాడు
బాలుఁడు—వీరసింగుని కుమారుఁడు

## స్త్రీలు

కమల—ఉదయసేనుని భార్య
మంజువాణి—కమల చెలికత్తె
తార—ఉదయసేనుని కుమార్తె
పుల్లి—పల్లివాని భార్య
కుముదాబాయి—వీరసింగు రెండవభార్య

కాళహస్తి సూర్యప్రకాశరావుచే రచియింపఁబడిన

# గ్రంథములు



## నాటకములు

| | |
|---|---|
| శ్రీకృష్ణతులాభారము వెల రు | 0—12—0 |
| లవకుశ | 0—12—0 |
| కనకతార | 0—12—0 |
| సారంగధర | 0—12—0 |
| జయంతజయపాల | 0—12—0 |
| ప్రహ్లాద | 0—12—0 |

## నవలలు

| | |
|---|---|
| ఎడిపోంగో | 1—0—0 |
| బజకాళిదాస చరిత్ర | 1—0—0 |
| హిందూదేశ గృహపరిశ్రమ దర్పణము | 1—0—0 |
| గుమ్మైన గుంట మున్నగు కామిక్ హాస్యపుస్తకములు 10. రకము 1కి 0—1—0 | 0—10—0 |

ఇవిగాక కొన్ని నాటకములు, నవలలు త్వరలో వెలువడఁగలవు.

అమ్మువారు:—

కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

సంస్కృతాంధ్ర బుక్కు డిపో

రాజమండ్రి.



ఓమ్

శ్రీరామా!

# కనకతార



## ప్రథమాంకము



### మొదటి రంగము—కొలువుకూటము



[ తెర యెత్తఁగా సింహాసనాసీనుఁడై ఉదయసేనమహారాజు, ధీమంతుఁడు, ప్రతాపుఁడు ]

ఉదయ:—సచివోత్తమా! నామనోవ్యథ యడంగు నవకాశము నాకు లభింపదు కాఁబోలు!

సీ. చతురబ్ధిపర్యంత సామ్రాజ్యమాయుండె;
చతురంగబలమును సంతరిల్లె;
వైరిరాజుల నాజి భంగమొందించెడి
చేవ కేవిధమైన చేటు లేదు;
సంక్రందనుని దివ్య సంపద హసియించు
భోగభాగ్యంబులు పొలుపుమీఱు;

సంతోషమునుగూర్చు సంతానమా కల్గె;
అనుకూలవతియె యర్ధాంగలక్ష్మి

గీ. నాదు కనుసైగలఁ జరించు నయవినయ వి
శారదులయిన సుగుణులున్నారు మీరు;
ఇన్ని కల్గియు నక్కటా! యెదను నాకు
క్రూరసేనుని కతన వి చారమొదవె.

ధీమం:—మహారాజా! మీరు సోదరుని చర్యలను గర్హించి హృదయమునఁ బరితపించుచున్నారని నేనెఱుంగుదు; పలుమాఱు లాతని జేరఁజేరి, దుష్టప్రవర్తనమునకు స్వస్తిచెప్పుమని చిలుకకుఁ జెప్పినట్లు చెప్పితిని. కాని ప్రయోజన మావంతయుఁ గానఁబడుటలేదు; నీతులం గఱపినందులకు నన్నాతఁడు తన పరమశత్రువుగా భావించుచున్నాఁడు.

ఉదయ:—మంత్రిసత్తమా! నేనుమాత్రము, చెడువర్తనము మానుమని చెవినిల్లుగట్టుకొని పోరలేదా? పోరితిని—పోరుచుంటిని—పోరఁగలను. కాని నీవుచెప్పినట్లు ప్రయోజనము మృగ్యమే!

గీ. ధర్మమార్గంబు దప్పక తనరుమనుచుఁ
బాపకార్యంబులనుజేయ వలదటంచు
నెంతచెప్పిన వానికి సుంతయైన
జ్ఞానముదయింపదాయెను స్వాంతమందు.

[ అపుడు క్రూరసేనుఁడు ప్రవేశము ]

క్రూర:—(తనలో) వృద్ధభల్లూకమువలె నన్నగారు సింహాసన మలంకరించిరి; మర్కటస్వరూపుఁడగు మహామంత్రిగా రేదియో ముచ్చటించుచున్నారు; దున్నపోతువలెనున్న సేనాని ప్రతాపుఁడు సాలోచనముగఁ గూరుచున్నాఁడు. ఇట నే నించుకసేపాగి వీరి సంభాషణ మాలకించెదఁగాక!

(చాటున నిలువఁబడియుండును)

ప్రతా:—దేవా! ఎంతతిన్నఁగాఁ దీసినను కుక్కతోఁకకుఁ గల వంకర పోదుగదా! క్రూరుఁడగు క్రూరునిలోఁ గల దుష్టస్వభావము మాటలతో మాయునుగునా?

క్రూర:—(తనలో) ఔరా! ఏమి నీకండకావరము. ఈ క్రూరుని దుష్టత్వమును జవిచూడఁగోరుచున్నావా?

ఉదయ:—సేనాధిపతీ! నీవు చెప్పినమాట సత్యమే! వానిచేఁతలు మాటలతోఁ గట్టవు; కాని యేకగర్భజనితులము గదా! నా హృదయము కోమలముగదా! ప్రేమను బాఱఁద్రోలి వానింబట్టి శిక్షించుటకు మానసమొప్పునా?

క్రూర:—(తనలో) చేవయున్నచోఁ జిత్తమొప్పకేమి? చేతకాని తనమని చెప్పుకొనరాదా?

ప్రతా:—రాజశేఖరా! మీ రిట్లుపేక్షసేయుట తగదు; ప్రజ లాతని దుండగములకు సహింపలేకుండిరి.

క్రూర:—(తనలో) ఉపేక్షసేయక, ఉరిపోసికొందువా? తుచ్ఛుఁడా! ప్రేలుము. ప్రేలుము.

ఉదయ:—సేనానీ! ప్రజలపీడం బాపుటయే రాజధర్మము.

ప్రతా:—అవశ్య మట్లు గావింపుఁడు. (కొంచెమాఁగి) మహారాజా! తలంచుకొనిన నా కాశ్చర్యము తోఁచుచున్నది. ఒకే తల్లి కడుపున వెల్వడినవానిలో నొకటి రత్నమా? వేఱొకటి గులకరాయియా? ఒకటి రాజహంసయా? వేఱొకటి గుడ్లగూబయా? ఒకవ్యక్తి గుణరత్నాకరుఁడైన దిగంత యశోవిశాలుఁడా? మఱియొకఁడు జారచోరదుష్కృత్యతత్పరుఁడా!

క్రూర:—(తనలో) నీకంత్యకాలము సమీపించినది; డేగ చెడిపోవు కాలమున మిడితెలనుబట్టును; ఆసన్నకాలమగుటచేతనే, క్రూరసేను నీవిధముగ అవకతవకమాటలాడుచున్నావు.

ధీమం:—(నవ్వుచు) ప్రతాపా! నీ కా విధాత్రు సృష్టివైచిత్ర్యము తెలి యదుకాఁబోలు! ఏకగర్భజనితులయ్యు మన మహారాజుగారు— ఉత్తములు గా నేల? క్రూరసేనుఁడు క్రూరుఁడుగా నేల? యని సందేహించుచున్నావు.

గీ. అమృతమందయిఁజుచోట హా ! లాహలంబు
పరిమళించిచ్చు సుమములు ! సరసముండ్లు
నత్తగుల్లలమధ్యను ! ముత్తెములును
పొడముచుండుట తెలియఁగవే ! పుడమియందు.

క్రూర:—(తనలో) ఓ వృద్ధజంబుకమా! ప్రతాపు నొంటరిగ యమ పురంబునకుఁ బోనిచ్చుట నీకు సమ్మతము కాదుకాఁబోలు! వానికిఁదోడుగా వెడలవచ్చును.

ఉదయ:—ధీమంతా! నీవు సార్థకనాముఁడవు; బృహస్పతింబోలినవాఁడవు. ఏను సింహాసన మలంకరించినది మొదలు నేఁటివఱకు నాకు సర్వవిధముల సహాయ మొనరింపుచున్నావు. ఈనాఁడు నాకుఁగల మనస్సంతాపమునుగూడఁ బాపు నుపాయ మెఱిఁగింపుము.

క్రూర:—(తనలో) ఉపాయ మా ముదుసలి కేమి తెలియును; వృద్ధులకు బుద్ధిచాంచల్యము నిక్కముగదా! నన్నడుగును. నేను జెప్పుదును.

[ అంత సేవకుఁడు సులోచనుఁడు ప్రవేశము ]

సులో:—జయముజయము మహారాజుగారికి.

ధీమం:—ఓరీ! నీవు వచ్చిన కార్యమేమి?

సులో:—ప్రభువువారిని సందర్శించుటకు రామిసెట్టి వచ్చియున్నాఁడు.

క్రూర:—(తనలో) గతరాత్రి నేను, అనుచరులగు వీరపాల శూర పాలురతోఁ గూడఁ బోయి వీనికిఁ జేసిన శాస్తిని జెప్పుకొనుటకుఁ గాఁబోలు వచ్చినాఁడు!

ఉదయ:—అమాత్యశేఖరా! రామిసెట్టి యనఁగా కొత్వాలేనా?
ధీమం:—అతఁడే; (సేవకునితో) ఓరీ! వాని నిందుఁ బ్రవేశపెట్టుము.
(సేవకుఁడు నిష్క్రమించును)
ప్రతా:—ఈతఁడు ప్రభుసందర్శనముం గోరు టెందులకో!
ధీమం:—ప్రతిదినము మనము చూచుటలేదా? అనేకులు ప్రభుసందర్శనముం గోరుట క్రూరసేనుని దుండగములను గూర్చి మొఱ పెట్టుకొనుటకేకదా!
క్రూర:—(తనలో) ఈ క్రూరసేనుని ప్రతాపము బోధపడుచున్నదా?
[ సేవకుఁడు రామిసెట్టిని బ్రవేశపెట్టును ]
రామి:—(వెక్కి వెక్కి యేడ్చుచు) బాబూ! మా రాజా! దణ్ణాలు. దణ్ణాలు!
క్రూర:—(తనలో) నిన్నరాత్రి యీ ముండకొడుకును దేహశుద్ధిచేసితిని; కాని పరలోకయాత్ర సేయునట్లు చేయలేదు.
ధీమం:—సెట్టీ! ఏడ్చుచున్నావేమి? నీకు వాటిల్లిన కష్టమేమి? ప్రభువారికి మనవిచేసికొనుము.
సెట్టి:—అయ్యో! బాబయ్యా! బాబయ్యా! నా కర్మం! నా పారెబ్బ—బంగారంలాంటి కోడిపిట్టోణ్ణి—రావరాజ్యంలాంటి పబువుల పరిపాలనలో కూడా కట్టాలు మాకు తప్పలేదు.
క్రూర:—(తనలో) నీ కష్టములు గట్టెక్కుటకు ఉదయసేనుఁడు చాలఁడు; క్రూరసేనుఁడే సమర్థుఁడు.
ఉదయ:—(విచారముతో) సెట్టీ! గుండె బాదుకొని నెత్తి మొత్తుకొని విచారింతువేల? నీకుఁ గలిగిన వెతం దెల్పుము.
సెట్టి:—బాబయ్యా! మారాజులుంగారూ! ఏఁవని సెప్పను? ఏఁవని సెప్పను? నోరురాదు. ఆ కూరసేనుఁడు బాబూ! నోరురాదు. (ఏడ్చును)

ప్రతా:—మంత్రివర్యా! మీ యూహ సమంజసమే!

ఉదయ:—(ఆత్రముతో) ఏమి? క్రూరసేనుఁడా? శతవృద్ధుఁడవు. భీరుఁడవు నగు నిన్నేమిచేసినాఁడు—చెప్పుము.

సెట్టి:—మగరాజా! నన్నొకణ్ణే సేసి ఊరుకోలేదు—అర్ధానికి—పాణానికి—మానానికి కూడా బంగం కలుగజేసేడు.

ధీమం:—అక్కటా! ఈ దుష్టుని దుండగముల కంతు లేకున్నదికదా!

ప్రతా:—అయ్యో! మహారాజుగారి సంతాపము వీని మాటల వలన మఱింత యధికమగునుగదా!

ఉదయ:—(ఆత్రముతో) సెట్టీ! సెట్టీ! చెప్పుము. భయపడకుము. ఆ దుర్మార్గుఁ డేమిచేసెనో సవిస్తరముగ నెఱిఁగింపుము.

సెట్టి:—సెప్పుకుంటేమాత్రం ప్రయోజనమేఁటి మారాజా! మీరు ఆయణ్ణి దండిస్తారా? మందలిస్తారా? కేకలేస్తారా? కాక లేస్తారా? ఏటీలేదు—ఇంక అనాదపచ్చుంం మేము సెప్పుకోడఁ వెందుకు. ఆయనికి తెలిస్తే సెప్పుతావా అని భూమ్మీద ఈ నూకలు కూడా లేకుండ సేస్తాడు.

క్రూర:—(తనలో) సెహబాస్! వైశ్యుఁడవుగనుక బుద్ధిసూక్ష్మత యున్నది.

ఉదయ:—సెట్టీ! నీ వట్లు తలంపవలదు. ధర్మమునందున్న యాసక్తి నాకు బాంధవ్యమునందు లేదు. నేఁటివఱకా క్రూరుని చర్య లను సహించితిని. ఇఁక సహింపను.

క్రూర:—సహింపకున్న కాటికేఁగుదువు?

సెట్టి:—మారాజా! నిన్నరాతిరికాడ తప్పతాగి తూలుతూ, యిద్దరి దుర్మార్గులతో వచ్చి మా యింటి తలుపు తట్టినాఁడు మీ తమ్ముఁడు.

ఉదయ:—(తనలో) "మీ తమ్ముఁడ" ను మాట కర్ణకఠోరమైనది.

ప్రతా:—పిమ్మట—

సెట్టి:—పిమ్మట లోనప్రవేశించి యినప్పెట్లు దోచేసినారు. (ఏడ్చుచు) మా తాతలకాడినుంచి సెవఁటూర్చి ఉప్పు సింతపండు అమ్మి కూడబెట్టిన ధనం—పోయిందీ! రాజా! పోయిందీ! పట్టుకుపోనారు.

ధీమం:—ఔరా! దోసిడికిఁ గూడఁ దొడంగినాఁడా?

ఉదయ:—అక్కటా! సుక్షత్రియవంశ సంజాతున కిట్టి యవినీతి కార్యములా?

సెట్టి:—మగరాజా! డబ్బుపోతే పోనాది. అంతతో వూరుకోలేదు.

ప్రతా:—అబ్బా! ఇంక నేమిచేసినాఁడు?

సెట్టి:—బాబూ! సెప్పడానికి నాలికాడదు—బాబయ్యా! అయ్యో! అయ్యో! ఎంతగోరఁ వెంతగోరం! పండంటిపిల్లగందా—సుక్కల్లో సందురుఁడులాగా యెలుగుతున్నాదని-యెదవని-యెదవని-వూరుకోక మూఁడోసారి పుస్తికట్టినాను.

ధీమం:—ఆఁ! ఆఁ! ఏమిచేసినాఁడామెను?

సెట్టి:—(గోలుమనుచు) ఏఁవని సెప్పుకోను మారాజా! ఆమె కొంగట్టుకు లాగఁబోయినాడు. నాకు కోపఁ వాగక, తాతలకాడ్నుంచి మూలపడివున్న తక్కెడసిబ్బితో మొకాన్న కొట్టబోయేను.

ప్రతా:—సెహబాస్! షాహుకారుబిడ్డవయ్యు, సాహసించి చక్కని పని చేసితివి.

ధీమం:—పిమ్మట.

సెట్టి:—(గోలపెట్టుచు) బాబూ! ఏఁటిసెప్పను. వెనుకబొంగుళ్ళాగ తేరేయి తట్లు!

క్రూర:—(తనలో నవ్వుచు) జన్మజన్మములకు మరచిపోకుము.

ప్రతా:—(సంతోషముతో) సెహబాస్! సెహబాస్! బాగుగజరిగినది.

సెట్టి:—(ఏడ్చుచు) ఏటి మరాజా! నాకు తట్లుతేరి--నేను దెబ్బలుతిని-నా మక్క లిరక్కొట్టుకొని--నా పాణం పోగొట్టుకొని-నా డబ్బు ఒదులుకొని--నా పెళ్లాన్ని పాడుసేసుకొని నే నేడుస్తూ గోలపెడుతూవుంటే మీకు బాగుందా? మారాజని మనవి సేసుకుంటే మరుకోరెండు తన్నమంటారా?

ప్రతా:—(తెల్లబోయి) ఓయి, నీవు వానిని జెడఁబాదితివని తలంచి సంతోషించుచు నట్లంటిని.

క్రూర:—(తనలో) అదియే నీ బుద్ధిహీనత!

సెట్టి:—కాదు. బాబయ్యా! కాదు. ఆయనే నన్ను, ఒప్పుకో లేదని మా యింటావిడని సెడమోదేను.

ధీమం:—ప్రభూ! ముందీ సెట్టిని బంపివైచి, నిమ్మట నా దుర్మార్గుని విషయమై తగు శ్రద్ధను బూనవలయును.

సెట్టి:—మారాజా! సిల్లిగవ్వ లేకుండా పట్టుకొనిపోనారు.

ఉదయ:—సెట్టీ! నీవు సాయంకాలము ఖజానాకు రమ్ము. వచ్చిన యెడల నీవు పోఁగొట్టుకొన్న ధనము నీ కొసంగఁబడును. ఇఁక మీఁద వానివలన నీవు బాధింపఁబడకుండఁదగు శ్రద్ధను వహింతువు. నీ విప్పటికిఁ బోవచ్చును.

సెట్టి:—(సంతోష మభినయించుచు) దండం మగరాజా దండం! మీకు వెయ్యేళ్లు సల్లగా వర్ధిల్లాలి. (తనలో) వొచ్చి మొర పెట్టుకున్నందుకు లాబగించింది. (ప్రకా) బాబూ! సెలవు తీసుకుంటాను. సాయంతరంవొస్తాను. (నిష్క్రమించును)

ఉదయ:—(తలవ్రాల్చి యాలోచన మభినయించును)

ధీమం:—రాజోత్తమా! ఇఁక మనము మిన్నకుండరాదు. సాహసించి, ధర్మమునకుఁ గట్టువడి, వాత్సల్యము నావలకుఁ ద్రోసి క్రూర

సేనుని క్రూరకృత్యముల సరికట్టనిచో — లోకాపవాదమునకు గుఱియగుదును.

ప్రతా:—

శా. ఆలోచింపెద వేల? సోదరుని యత్యాచార మాలించియున్
కాలాతీతము సేయఁజూడకు నృపా! యీ కార్యంబసామాన్యమే?
ఆలస్యా దమృతం విషంబనెడు వాక్యంబీవు బాటించి, భూ
పాలా! సోదరుఁబట్టిబందిని సుమా! యీ ప్రావీణ్య మేపారఁగాన్.

క్రూర:—(తనలో) ఔరా! నన్ను బంధింపఁ బెట్టుమాని యాలోచనము సెప్పుచున్నావా? కానిమ్ము. నేను జెఱప్రవేశించుట కల్ల! మీరు యమపురముం జేరుకొనుట నిశ్చయము!

ధీమం:—అదియే యుత్తమకార్యము.

ఉదయ:—ప్రతాపా! నీవు చెప్పినట్టు చేయనొప్పను. నేఁటివఱకుఁ బ్రజలు గోలపెట్టుచున్నను, ఏకోదరుఁడుగదాయని కనికరించితిని. ఇఁక నట్టి కనికరముఁ జూప వీలులేదు. దుర్యశమును మాత్రమొల్లను. బంధుత్వమునయినఁ బరిత్యజింతును. (మంత్రి నుద్దేశించి) అమాత్యశేఖరా! క్రూరసేనుని జెఱయందుంచుట మాసమ్మతి నెఱిఁగించుచు, ఆజ్ఞాపత్రమును వ్రాసి ప్రతాపుని కీయుఁడు.

ధీమం:—చిత్తము. (ఆజ్ఞాపత్రమును వ్రాసి యిచ్చును)

ప్రతా:—రాజోత్తమా! మీరింక నిశ్చింతతోనుండుఁడు; క్రూరసేనుఁడు చెఱలో నున్నాఁడనియే తలంపుఁడు.

క్రూర:—(తనలో) మీరెల్లరు యమపురిలో నున్నారనియే తలంపరాదా?

ఉదయ:—సచివరా! నేఁటికిక సభ చాలింతము.

ధీమం:—చిత్తము (అంత ముఫ్ఫురును నిష్క్రమింతురు)

క్రూర:—[ప్రవేశించి] ఆహా! ఏమి యీప్రతాపుని బుద్ధిహీనత! పులిమీసాలతో ఉయ్యాలలూఁగనున్నాఁడు; నాముందు వీని ప్రతాపమెంత! వీఁడు నాయొద్ద—అగ్నిలోని మిడుత—సింగపుఁ గోరలముందు కురంగము! ఎంతసాహసము. కోరి చావును దెచ్చుకొనుచున్నాఁడు. అనల్ప పరాక్రమశాలి నగు నన్నీ తుచ్ఛుఁడు తెలియఁజాలఁడని సలహా చెప్పుట—వృద్ధరాజు గ్రహించుట—మంత్రి సంతోషించి యాజ్ఞాపత్రమును వ్రాసి యిచ్చుట—బాగుగనే యున్నవి. యమపురములో స్థలము ఖాళీగానున్నది. వీరిని ముగ్గురను ఏకముహూర్తమునఁ బంపితి నేని, యముఁడు సంతోషించును. వీరపాల శూరపాలురను బిలిపించి, నాకార్యసన్నాహమున నేనుండెదఁగాక!

(నిష్క్రమించును)

(తెర పడును)

---

## రెండవ రంగము



[ప్రవేశము క్రూరసేనుఁడు, వీరపాలుఁడు, శూరపాలుఁడు]

శూర:—క్రూరసేనమహారాజా! మమ్మిరువురను ద్వరలోనే రావలసి నదిగా నాజ్ఞాపించితి రేల?

క్రూర:—(సంతోషముతో) శూరసేనా! నీసంబోధనము సాభిప్రాయ ముగనే యున్నది. (కొంచెము మూఁగి) మిత్రులారా! శత్రువుల నేమి చేయవలయును.

శూర:—జంకుగొంకులు లేక సమయింపవలయును.

వీర:—(తనలో) ఈ దుర్మార్గుఁ డేదియో మఱియొక దురాలోచన మొనరింపుచున్నాఁడు.

క్రూర:—వింటిరా నేఁడొక విచిత్రము?

శూర:—(ఆత్రముతో) ఏమది?

క్రూర:—ఏమున్నది? ఉదయసేనుఁడు నన్నుఁ బట్టి కారాగృహమునఁ బెట్టుమని ప్రతాపున కాజ్ఞ యిచ్చినాఁడు.

శూర:—ఔరా! ఎంతసాహస మెంతసాహసము!

వీర:—ప్రభూ! మిమ్ములను జెఱయందుంచుట కెవ్వరికి సాధ్యము?

క్రూర:—వీరపాలా! నీవు చెప్పినమాట నిక్కమే కావచ్చును. నేను శక్తిసంపన్నుఁడనే కావచ్చును. కాని శత్రువుల నుపేక్ష చేసినచో నేఁడుగాకున్న రేపయిన మనకుముప్పుతప్పదు. అడుసుఁ ద్రొక్క నేల? కాలుఁ గడుగ నేల? శత్రువుల కవకాశమీయ నేల? పిమ్మటఁ దొట్రుపడ నేల? ఆరంభముననే జాగరూకత వహించి, కార్యముం జక్కఁబెట్టుటొప్పదా?

శూర:—దేవా! మీమాట యుక్తమే! మేమిరువురము విశ్వాసపాత్రుల మగు బంటులము; మొదటినుండియు మిమ్ముల నాశ్రయించుకొని యుంటిమి. మీకొఱకుఁ బ్రాణముల నర్పించుటకయిన వెనుదీయము. మాకు సత్యముతో సంబంధము లేదు. న్యాయముతోఁ బని లేదు. ధర్మమునం దాసక్తి లేదు. మీయాజ్ఞలం బాలించుటకు—అసత్యములాడుటకు జంకము—హత్యలు సేయుటకు గొంకము. దొంగతనములోఁ బ్రసిద్ధులము—దోపిడిలో నిపుణులము—జారులలోఁ జక్రవర్తులము. మాసామర్థ్యము మీకుఁ దెలియనిదా? కనుక సందేహముమాని కర్తవ్యమును నిరూపించుఁడు.

క్రూర:—(సంతోషముతో వాని బుజముం దట్టుచు) సెహబాస్! మిత్రుఁడా! నీవంటి ధీశాలి నాయండనుండఁగా నాకు లోప

మేమి? (ఇంచుక సేపాగి) ప్రస్తుత కర్తవ్యమిది. నన్నుఁ గారాగార వాసునిగాఁ జేయఁదలఁచినందులకుఁగాను, ఆ మువ్వురను ఈ రాత్రిగాఁ నిద్రించుతరి వధింపవలయును.

వీర:—(తనలో) ఔరా! ఎంతటి క్రూరకార్యమునకుఁ బురికొల్పుచున్నాఁడు! యుక్తివాక్యములచే నెమ్మదిగ వీని మనస్సుం ద్రిప్పుయత్నించెదను. (ప్రకాశముగా) రాజా! మనము నిద్రించువారిని పందలవలె పైఁబడి చంపనేల?

క్రూర:—లేకున్న ధైర్యవంతులవలెఁ జంపుట యెట్లు?

వీర:—యుద్ధము చేసి

క్రూర:—(అట్టహాసముగ నవ్వి) వీరపాలా! నేఁడు మద్యపానము సేయ మరచితివా? మందునివలె మాటాడుచున్నావు. మనము వారితో యుద్ధము సేయుటెట్లు? మనకు సైన్యమా? లేదు; ధనమా? శూన్యము; ప్రజాభిప్రాయము కలలోనివార్త! ఆయుధములా? మృగ్యములు. ఇఁకఁ జతురంగబలశోభితుండగు ఉదయసేనునితో యుద్ధముసేయుటెట్లు? ఇదియొకవిషయము. మనమీనాఁడు మిన్నకుంటిమేని, ప్రతాపుఁడు సామాన్యుఁడు గాఁడు. వాఁడు తప్పక తగిన పరివారముతో వచ్చి నన్నుఁబట్టుకొనఁగలఁడు; కనుక మోసమే యిప్పట్ల మనకాచరణీయము.

వీర:—(తనలో) ఈతఁడు కడుంగడు దుష్టుఁడు. తలపెట్టినపనిని చేయకుండ విడువఁడు. వీనికడ్డుదగులుట మంచిదికాదు; కొంచెమిట్లే మాటలాడి ధనమును గుంజెదను. (ప్రకాశముగా) మహారాజా! నేఁడేలకో నాహృదయము హత్యల కంగీకరింపకున్నది. శూరపాలుని సహాయముతో మీరు కార్యమును సాంతము చేసి లబ్ధవిజయులు కండు.

క్రూర:—(తనలో) ఈతఁడద నెఱింగి కొంచెము విత్తము లాగుటకై యిట్లు పలుకుచున్నాఁడు. కానిమ్ము. అవసరము వచ్చినప్పుడు

ఖర్చుపెట్టక తప్పదు. (మెడలోని ముత్యాలహారముం దీసియిచ్చి) వీరపాలా! నీవు దీనిం గైకొనుము. వెంటనేపోయి శూరపాలునితోం గూడ మద్యముం గ్రోలిరమ్ము. దానితోం గావలసినంత యుత్సాహ ముదయించును. ఒక్క హత్య మాత్రమేకాదు; పదివేల హత్యలను జేయంగలవు.

సీ. సాహసంబునకిల్లు । జారత్వమునకునిక్క-
ప్రథితధైర్యమునకుం । బట్టుగొమ్మ!
దోపిడికాండ్రకు । దొడ్డదాచేయూంత
హత్యలన్నిటికిని । ఆటపట్టు!
మోసంబునకుం దండ్రి । ద్రోసంబునకుం దల్లి
దొంగతనాలకు । సంగడీడు!
ఋజుమార్గమునకు శ । త్రువు; డంబమునకూంత
జూదగాండ్రకు ముద్దు । సోదరుండు
గీ. అయిన మద్యపానముచేత । నలవికాని
కార్యమొండున్నదేయిల? । కనుకనీవు
దానిసేవించి మదియందు । ధైర్యమూని
సత్వరంబున రాంగదే । సఖుండ మగిడి.

(శూరపాలు నుద్దేశించి) శూరపాలా! నిన్నుంగూడం దగినరీతిని సంతోషపెట్టెదను. రేపు సింహాసన మధిష్ఠించినపిమ్మట నేను పేరునకు మాత్రము రాజును. పాలనాదికమంతయు మీమీం దనే యుండును.

శూర:— దేవా! మీరు నా కింతంగాం జెప్పవలయునా?

క్రూర:—మిత్రులారా! మీరింకం దడయనేల?

గీ. ఏను పోవుచునున్నాండ । నిపుడుకానం
గార్యనిర్వాహమున కింకం । గడంగుడంచుం

జెప్పి భానుండదె గగన సీమవీడి
పశ్చిమాంబుధిలోనఁ దాఁ బడుచునుండె.

సాంధ్యరాగము నలుగడల నలముకొనుచున్నది. మీ రేగి మాటు మణిగినపిమ్మట ఆయుధపాణులై నా మందిరమునకు రండు— మున్ముందు ధీమంతప్రతాపులను కాఁజేసి, పిమ్మట ఉదయ సేనుని జక్కఁజేయవచ్చును.

వీర:—ప్రభూ! మే మిరవురము పోవుదుము. సరిగా మీరు చెప్పిన తరుణమునకు వచ్చెదము.

క్రూర:—మంచి దటుసేయుఁడు. నేను మీ రాక కెదురుచూచు చుందును. మీరు తెచ్చు కత్తులు మిక్కిలి పదునుగలవిగా నుండవలయు. అది మాత్రము మరచిపోకుఁడు.

వీర:—చిత్తము. శూరపాలా! రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

క్రూర:—(స్వగ) ఔరా! ధన మేమిచేయింపదు? ఆదిలో వెనుదీసిన వీరపాలుఁడు ముత్యాలహారముఁ జూచుటతోడనే, ముందంజ వేసినాఁడు. కిడు టక్కరి! శూరపాలునకు వీని కున్నంత చాతు ర్యము లేదు; ఎటుచెప్పినను, వాఁ డొప్పుకొనును. వీఁ డట్లు కాదు—సమయానుకూలముగా ధనసంగ్రహణము సేయకమా నఁడు. కానిమ్ము. కార్యసాఫల్యమే యిప్పట్ల ఆవశ్యకము. (ఉదయసేను నుద్దేశించి) ఓ వృద్ధభల్లూకమా! ఉదయసేనా! నీవి క్రూరసేనుని సామర్థ్య మెఱుంగవు. ప్రజలను దోచు కొనుచున్నాఁడు. స్త్రీలను జెఱఁబట్టుచున్నాఁడు. అనియే తలం చితివి. వెఱ్ఱివాఁడవు! నేఁడు పదునుకత్తితో నీ కుత్తుకనుబట్టి కోయఁగలఁడని తెలిసికొనలేకపోయితివి. నీవా? నన్నుఁ జెఱ బెట్టునది? ఓ ధీమంతప్రతాపులారా!!

గీ. క్రూరసేనుఁడు దుష్టుఁడం చేమొ ప్రేలి
నారు చెఱఁబెట్టఁగాఁ జూచి నారు మీరు;
మిమ్ము ముప్పురఁ గడతేర్ప నెమ్మనమునఁ
దలఁచి, యీ రాత్రి కుత్తుకల్ తరిగెదేను!

ఇఁక నేఁబోయి కార్యసిద్ధికివలయు ప్రయత్నములను జేసికొందును.

(నిష్క్రమించును)

( తెర పడును )

---

మూఁడవ రంగము—అంతఃపురాంతర్భాగము



[ ప్రవేశము—కమల, మంజువాణి ]

కమ:—చెలీ! మంజువాణీ! నేఁ డింకను నాథుఁడు రాకయుండుటకుఁ గారణమేమి?

మంజు:—దేవీ! నేఁడు ప్రభువువారు సభ దీర్చియుండఁగా కోత్వాలగు రామిసెట్టి వచ్చి—

కమ:—(అర్థోక్తిలోనే) వచ్చి—చెప్పుము; వినుటకుఁ గుతూహల మధికమగుచున్నది.

మంజు:—గతరాత్రి క్రూరసేనుఁడు ఘోరపాల వీరపాలురను అనుచరులతోఁ గూడ దన యిల్లుఁజొచ్చి, ధనమంతయు దోచుకొనుట మాత్రమే కాక, అకటా! చెప్పుటకు నోరు రాకున్నది.

కమ:—ఆహా! ఎట్టి యత్యాచారములొనరింపుచున్నాఁడు! పిమ్మట?

మంజు:—పిమ్మటఁ దన భార్యను బలాత్కరించినాఁడని మొఱవెట్టుకున్నాఁడు.

కమ:—(చెవులు మూసికొని) శ్రీహరీ! ఎంతటి దారుణకార్యములాచరించుచున్నాఁడే! ఎల్లప్పుడు మన్నాథునికి వీనిని

గూర్చిన మనోవ్యథయేకదా! ఎన్నియో పర్యాయములు పర
కాంతలను బట్టవలదని చెప్పితి.

సీ. మధుపానమునుమాని ౹ మసలుమంచును సదా
నాథుఁడు బోధించె ౹ నయముమీఱ
పరభామలనుబట్ట ౹ పాపమంచును సదా
నాథుఁడుబోధించె ౹ నయముమీఱ
చౌర్యంబు విడనాడి ౹ సంచరింపుమటంచు
నాథుఁడుబోధించె ౹ నయముమీఱ
దుష్టసాంగత్యము ౹ తొడరనీఁడుమటంచు
నాథుఁడుబోధించె ౹ నయముమీఱ
గీ. ఎంతబోధించినను వాని ౹ స్వాంతమందు
నంతయును మార్పులేకుంట ౹ నూడకొక్కొ!
పట్టి దండించుటొప్పదే ౹ ప్రాణనాథుఁ
డతనిసోదరుఁడన్ మాట ౹ నాతినివీక్షి

మంజువాణీ! గతరాత్రి నా కొక దుష్టస్వప్నము వచ్చినది. అప్పటి
నుండియు నా మనస్సు కలఁతఁజెందియున్నది నీవీ వర్తమాన
మెఱిఁగించినపిమ్మట మఱింత దిగులగుచున్నది.

మంజు:—అమ్మా! ధైర్యము వహింపుఁడు. మీరు వ్యాకుల మొంద
లగు? స్వప్నములకు శకునములకు లెక్కసేయ నేల? (కొంచె
మాఁగి) పదములచప్పుడు వినఁబడుచున్నది. మహారాజుగారు
కాఁబోలు నిటు వచ్చుచున్నారు. నే నేఁగుచున్నాను.

(నిష్క్రమించును)

[ అంత విచారగ్రస్తుఁడై ఉదయసేనుఁడు ప్రవేశము ]

కమ:—(ఎదురేఁగి) నాథా! నేఁ డింతసేపటివఱకుఁ దడసితి రేల?
(ముఖలక్షణములఁ బరికించి) అయ్యో! నాథా! ఇదేమి?

మీ నేత్రము లశ్రుపూరితములైనవి? ముఖమున దీనత్వము పొడసూపుచున్నది. కారణ మెఱిఁగింపుఁడు. ఏలకో నా చిత్తము తత్తరపాటుం జెందుచున్నది.

ఉదయ:—(నేలఁగూలఁబడి) అకటా! ప్రాణేశ్వరీ! నే నేమని చెప్పుదును? పవిత్రమంబగు నాతల్లి గర్భమున నాతోఁబాటొక రాక్షసుఁడు—క్రూరాత్ముఁడు—హంతకుఁడు జనించినాఁడు.

కమ:—నాథా! వానిచర్య లెప్పుడును వినుచునే యున్నాము. నేఁడు వింతలేమయిన నున్నవా?

ఉదయ:—అయ్యో! వింత లందువేమి? హా ధీమంతా! బుద్ధికుశలతచే బృహస్పతిని ధిక్కరించువాఁడవుగదా!

కమల:—(తనలో) ఏమి, నాథుఁ డిట్లు ధీమంతుని దలఁచి విలపించుచున్నాఁడు! (ప్రకాశముగా) ప్రాణనాథా! ధీమంతుఁడు కుశలుఁడేనా?

ఉదయ:—(ఏడ్చుచు) అయ్యో! ఇంకెక్కడిధీమంతుఁడు! క్రూరసేనుని వాడిఖడ్గమునకు ఎరయైపోయినాఁడు.

కమల:—(విషాదాశ్చర్యములతో) ఆఁ! ఆఁ! క్రూరసేనుఁడు మంత్రిసత్తముఁడగు ధీమంతుని హత్య గావించినాఁడా?

ఉదయ:—ఒక్క ధీమంతునేకాదు; సేనాధిపతియగు ప్రతాపుఁడుకూడ నాఖలుని ఖడ్గధారచే ఖండితశిరస్కుఁ డాయెను.

కమల:—(ఇంచుకసేపు స్తంభీభూతయై) అన్నన్నా! ఎంత దారుణ మెంత దారుణము!

ఉదయ:—(దుఃఖించుచు) అయ్యో! చెలీ! దారుణమని నెన్నదిగ ననుచున్నావా? ఇఁక నాకు బ్రతుకెందులకు?

కమ:—అయ్యో! నాథా! అమంగళము లాడెదరేల?

ఉదయ:—ప్రాణేశ్వరీ!

సీ. బుద్ధి బృహస్పతిం । బోలిన ధీమంతు
నెడఁ బాసి పాలనం । బెట్లు సేతు?
వీరాగ్రగణ్యుఁడై । పేరుగాంచిన ప్రతా
పుని బాసి ధరణిపై । మనుటయెట్లు?
పరకాంతలనుబట్టి । భంగమొందించెడు
క్రూరుండు సద్బుద్ధిఁ । గోరఁడకటా!
వాని కార్యంబునో । ప్పరికింప దుర్యశో
మొదవుచున్నదికదా । యుర్వినాకు!

గీ. ఇంక నేరీతి మనువాఁడ! । ఏమిసేతు?
ఎవరివేఁడుదుఁ గర్తవ్య । మెఱుఁగ నబల!
అంతచేసిన ఖలుఁడు న । న్నవనియందుఁ
బట్టి చంపఁడే తరుణము । వడసినంత!

కమ:—(చెవులుమూసికొని) హరిహరీ! నేఁ డిట్టి యశ్లీలములు వినఁబడుచున్న వేమి? (తనలో) అక్కటా! గతరాత్రి నేఁగనిన దుష్టస్వప్నమున కనుగుణ్యముగఁ బొడసూపుచున్న వేమి పరిస్థితులు! ఏదియెట్లుజరిగినను నాథునకు దుఃఖోపశమన మొనర్పవలయును. (ప్రకాశముగా) హృదయేశ్వరా! మీ నోటినుండి యిట్టిమాటలు వెలువడిన నామనస్సెట్లుండును? లోకములో ధర్మమే యెప్పటికయిన జయించును. అధర్మము నశించును. నేఁడు మీసోదరుండొనరించు దుష్కార్యములను సర్వసాక్షి యగు సర్వేశ్వరుఁడు చూచుచునే యున్నాఁడు!.........

ఉదయ:—జీవితేశ్వరీ! ఆదుష్టుని క్రూరకృత్యములకంతుగాననా? ఎప్పటికయిన వాఁడీల్గునా?

కమల:—నాథా! అట్లనురేల? ఆతఁడు పశుప్రాయుఁడై, నిర్దయుఁడై, యిట్టి యకార్యము లాచరించినచో వాని పాపము వానినే బ్రద్దలుసేయును. దశకంఠుఁడు-జలంధరుఁడు-కీచకుఁడు మున్నగు వారెంతమంది తమ కర్మఫలముల కధీనులై చావలేదు? విచారము మానుము; వ్యాకులమును బోనాడుము; ధైర్యము జిక్కఁబట్టుము. (ప్రక్కకుఁ జూచి) నాథా! తారా కనకసేను లిటే వచ్చుచున్నారు.

[అంత తారా కనకసేనులు ప్రవేశము]

తార:—జనకా! వింటివా? పినతండ్రిగారి దుష్కార్యము?

కనక:—అక్కా! ఆదుష్టుని పినతండ్రియనుట నీదోషము; ధీమంత ప్రతాపులను గంటకాలముక్రిందట హత్యచేసిన యా ఖలుని నామ మీయర్ధరాత్రమునఁ దలంపరాదు.

[అపుడు క్రూరసేన వీరపాల శూరపాలురు ప్రవేశించి, రహస్యముగ స్తంభమునానుకొని నిలువఁబడి యుందురు]

ఉదయ:—కనకా! మంచిమాట చెప్పితివి.

కమ:—నాయనా! అమ్మా! మీరిరువురు నింతసేపటివఱకుఁ దెలిసి యున్నారెందులకు? బుడుతలగు మీరు పెందలకడ నిద్రింప రాదా?

తారా:—అమ్మా! మేము నిద్రించినవారమే ధీమంత ప్రతాపుల హత్యాసమాచారము నగరులో అలజడి కలిగింపఁగా లేచి యిటువచ్చితిమి.

కమ:—మీరిరువురు వచ్చి యిక్కడఁ బరుండుఁడు.

(తారా కనకసింహు లట్లు చేయుదురు)

ఉదయ:—ప్రేయసీ! నేఁడేమియోగాని, హృదయము భార మగుచున్నది.

కమ:—నాథా! దుఃఖభార మట్లనుపించును; రమ్ము; నా యంకతలమున శిరముంచి నిద్రింపుము

ఉదయ:—(అట్లు సేయును)

[అంతఁ గొంతసేపయినపిమ్మట ఆయుధపాణియగు క్రూరసేనుఁ డుదయసేనునిమీఁదికిలంఘించి, ఆతనికుత్తుకఁ గోయుచుండును; శూరపాలుఁడు కమల కంఠమునకుఁ గత్తి గుఱిసేయును; వీరపాలుఁడు తారా కనకసింహులం బట్టుకొనును. హాహాకారములు—ఏడ్పులు—బొబ్బరింతలు]

(తెర పడును)

ప్రథమాంకము సంపూర్ణము.





ఓమ్

# కనకతార



## ద్వితీయాంకము



### మొదటిరంగము



[ ప్రవేశము మంజువాణి—సులోచనుఁడు ]

సులో:—మంజువాణీ! బెబ్బులింజూచి పసుగులెత్తు గోవు చందమున నట్లు భయపడుచున్నా వేమి?

మంజు:—(నెత్తిమొత్తుకొనుచు) అయ్యో! అయ్యో! ఇఁక నేమున్నది. సర్వనాశనము. అబ్బా! అబ్బా! ఆదృశ్యమును జూచినది మొదలు నాలుకతడియారిపోవుచున్నది. కన్నులుతిరుగుచున్నవి.

సులో:—(తనలో) ఈమె యేదియో దారుణసంఘటనము జూచి యుండవచ్చును. లేకున్న నింతభీతిల్లియుండదు. (ప్రకాశముగా) మంజువాణీ! అసలు విషయమును దెలుపక, నాకు మనమునఁ గలఁతఁ బుట్టించుచున్నావు.

మంజు:—అదుఁగో—అదుఁగో—బాబూ—చంపకు.

సులో:—(నలుప్రక్కలఁజూచి) బేలవై యేల భయపడుదువు? నీ మాటలు కడుంగడు చిత్రముగనున్నవి. ఎవరిని చంపవలదని వేఁడుకొనుచున్నావు?

మంజు:—(ఇంచుక సేదదేఱి) ఏమి? క్రూరసేనుఁడు ఖడ్గధారుఁడై యిటు వచ్చుటలేదా? నిజముగ నాతఁ డిక్కడ లేఁడా?

సులో:—(తనలో) ఏదియో కొంప మునిఁగినది. లేకున్న నీమెయింత డిల్లవోవదు. (ప్రకా) మంజువాణీ! క్రూరసేనుఁ డిక్కడ లేఁడు. చెప్పుము. ఆతఁ డేమిచేసినాఁడు.

మంజు:—(నలుప్రక్కలఁ జూచి) సులోచనా! కొంప మునిఁగినది. దుర్మార్గుఁడు-రాక్షసుఁడు-క్రూరసేనుఁడు-అకటా! మహారాజా! అయ్యో! ఎట్టి దారుణము సంభవించినది?

సులో:—(ఆత్రముతో) ఆఁ! ఆఁ! మహారాజున కాపద వాటిల్ల లేదుకదా!

మంజు:—అయ్యో! ఇంకెక్కడిమహారాజు! రాత్రి నిద్రించుచుండఁగా క్రూరసేనుఁడు ఖడ్గపాణియై వచ్చి మహారాజుగారి కంఠమును-

సులో:—హా! మహారాజా! హా ఉదయసేనప్రభూ! ఎంతలో నెంత చెట్టమూడినది!

మంజు:—సులోచనా! ఆ ఖలుఁడు—ఆ మానవాధముఁడు మహారాజు గారి కంఠమును కోయుటతో తృప్తిచెందలేదు. మహాసాధ్వి యగు కమలాదేవిని బలాత్క.......

సులో:—(చెవులుమూసికొని) హరిహరీ! ఈ పాపపుఁజెవులతో నెట్టి మాటలను వినుచున్నాను.

[ అంత నేపథ్యమున ]

చ. "సుమశరుఁ డేయు బాణముల
సోలుచుఁ దూలుచు నున్న నన్ను నీ
వమల హృదంతరాళమున
నాదరమొప్పఁగఁ జూడవేల? నా

సము లిల లేరు నీకుఁ గను
సన్నుల మెల్లఁగఁ గేళిఁదన్నవే!
కమలదళాక్షిరో! యటులఁ
గాదన నీ వికఁ నుండ నేర్తువే!"

సులో:—(వినుట నభినయించి) కాముకప్రలాపములు వినఁబడుచున్నవి. వా రెవ్వరై యుందురు?

మంజు:—(ముందునకుఁ బోయి చూచి) అయ్యో! అయ్యో! కొంప మునిఁగినది. క్రూరుఁడు సాధ్వీమతల్లి యగు కమల వేణిం బట్టి తన్నుఁ బొందుమని బలాత్కరించుచున్నాఁడు.

సులో:—హా తల్లీ! కమలాదేవీ! భర్తృమరణముచే విదారితంబయిన నీ హృదయము నీ దుర్మార్గుఁ డిట్లు దుఃఖపెట్టుచున్నాఁడా?

మంజు:—(ప్రక్కకుఁ జూచి) అయ్యో! ఇంకేమున్నది? ఆ దుర్మార్గుఁ డిటే వచ్చుచున్నాఁడు. రమ్ము. పోవుదము. పాఱిపోవుదము. లేకున్న మన ప్రాణములు నిలువవు.

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెర పడును)

---

రెండవ రంగము—సముద్రతీరము



[ ప్రవేశము—కమల ]

కమల:—హా స్వామీ! దీనదయాపరతంత్రా! ఆర్తరక్షణదీక్షాదక్షా! ఎట్టి కష్టములు తెచ్చితివి? సద్ధర్మనిరతుండగు నా ప్రాణేశ్వరుని అకటా! కటికివాఁడు మేకను గోసినట్లా క్రూరుఁడు కోసినాఁడే! అధమాధముండగు కీచకుఁడు ద్రౌపదిపయిం బడనుంకించినట్లు—దుశ్శాసనుం డామె వలువల నొలువఁబూనినట్లు—

దశముఖుండు సీతను గాంచింపఁ జూచినట్లు—అయ్యో! ఈ దుర్మార్గుఁడు నన్నా నరింపుచున్నాఁడే? ఇఁక నా కేది దిక్కు? నన్నెవ్వరు రక్షింతురు? నా మొఱ నెవ్వ రాలింతురు?

సీ. సురలార! గిరులార! తరులార! కరులార!
పాపరే క్రూరుని బారి నాకు
మునులార! జనులార! ఘనులార! ఫణులార!
పాపరే క్రూరుని బారి నాకు
యక్షులార! రణహర్యక్షులార! యిపుడు
పాపరే క్రూరుని బారి నాకు!
సిద్ధులారా! సుప్రసిద్ధులారా! ప్రీతిఁ
బాపరే క్రూరుని బారి నాకు
గీ. భర్తఁ గడఁదేర్చి నిద్రించు సమయమునను;
న్యాయ మన్యాయమనునది యరయఁ బోక
వదిననగు నన్నుఁ బొందంగ మదిఁదలంచె;
పాపరే మీరు! క్రూరుని బారి నాకు!

హా! ఏమి పలుకకున్నారు? మీలో నొక్కరకును నా మీఁద దయలేదు; అనాథనై దుఃఖాగ్నికింధనమయి మిమ్ముల నతి దీనముగ వేడుకొనుచుండఁగా మీకు మనసు కరఁగుట లేదా? అకటా! ఇఁక నా కేదిగతి! (పక్కకుఁ జూచి) అల్లదే మృగమును వెంటాడు వేటకానివలె నా దుర్మార్గుఁ డిటు వచ్చుచున్నాఁడు. హా! ఇఁక మానసంరక్షణ మెట్లొనరించుకొందును? (సముద్రముం జూచి నమస్కరించి) ఓ రత్నాకరా! సాగరా! దేవతలకుఁ గాని భూదేవతలకుఁ గాని నృపాలురకు గాని దిక్పాలురకుఁ గాని, నా మీఁద కనుపట్టలేదు. తండ్రీ! నీవైన నా కాశ్రయ మొసంగుము.

సీ. అల్లారుముద్దుగా । నలరిన లక్ష్మిని
హరికిచ్చి పెండ్లి గా । వించినావు!
రామభూజానికిఁ । బ్రేమతో దారిచ్చి
భూపుత్రి యిక్కట్లు । బాపినావు!
ఇష్ట మృష్టాన్నంబు । లెవ్వేళ నొసఁగెడు
కామధేనువు నిచ్చి । కాచినావు!
సలలితపీయూష । సంపదదయచేసి
ఎల్లదేవతలను । నేలినావు!
గీ. ఏను పతిని గోల్పోయిన । యింతి నకట!
పాపుఁడౌ క్రూరసేనుని । బారిఁద్రోసి
ఆశ్రయంబిచ్చి రక్షింపు । మయ్య! నాకు!
అన్యులనువేడ నీవె న । న్నాదరింపు!

(అని సముద్రములోఁ బడనుండఁగా, క్రూరసేనుఁడు వచ్చి పట్టుకొనును)

క్రూర:—("సుమశరుఁ డేయు బాణముల" అను పద్యముంజదువును)

కమల:—హా భగవంతా! నా మానముంగాపాడవా? (మూర్ఛిల్లును)

క్రూర:—పోయిన మగనికొఱ కింత యేడ్పు మెందులకు? అప్రకపరాక్రమ శాలిని—రూపజితమారుండను—నేఁటినుండి మహారాజును—అగు నన్ను బ్రేమింపరాదా? నాకోర్కె తీర్పరాదా?

కమల:—(లేచి) ఛీ! దుష్టుఁడా! ఏమనుచున్నావు? మాతృసమాన నగు నేను నీకోరికను దీర్పవలయునా? పాపీ! సాధ్వీమణి నగు నాభర్తను జంపి, నన్ననాథను జేసి, మీఁదుమిక్కిలి నా మానము జెఱుపఁగోరుచున్నావా? నీనాలుక చీలుకలుగాను!

క్రూర:—(వెకిలినవ్వ నవ్వుచు) నీయందలి మోహముచే నూరకొంటిని. గాని లేకున్న నిన్నుకూడ నిశాగ్రి గతించినవారి సహాయార్థమై పంపెడివాఁడనే!

కమల:—అట్లు చేయుము. నాకు పరమానందము. నా ప్రాణేశ్వరుఁడు లేనప్పుడు నా కీ తనువేల? నిన్ను బ్రతిమాలుకొందును. నా నాథునిజంపిన కత్తితో నన్నుఁగూడ ఖండింపుము. అట్లు చేసితివేని నీకు పుణ్యముండును.

క్రూర:—ప్రేయసీ! నిన్ను జంపుటకాదు నాయభిమతము నీతోఁగూడి మన్మథు నారాధించుటే!

కమల:—ఛీ! దుష్టుఁడా! అగ్రజునిల్లాలినగు నన్నిట్టికోరికను గోరుటకు, ఈరీతిని సంబోధించుటకు నోరెట్లు వచ్చుచున్నదిరా దుర్మతీ! పరదారాగమనము సంతోషకరము గాదు. వినాశకరమని యెఱుంగుము.

సీ. పరభామినుల పొందు ॥ వాంఛించుట నెగదా!
కీచకుండిహలోక ॥ గృహముపాసె!
పరభామినులపొందు ॥ వాంఛించుట నెగదా!
దశకంఠుఁడాజిలో ॥ దగ్ధుఁడాయె!
పరభామినులపొందు ॥ వాంఛించుట నెగదా!
అలజలంధరుఁడు దా ॥ నడఁగినాఁడు!
పరభామినులపొందు ॥ వాంఛించుట నెగదా!
నరకాసురుఁడు మేను ॥ దొఱఁగవలసె!

గీ. ప్రథిత బలవంతులయ్యును ॥ వసుధ మున్ను
అన్యకాంతలఁగోరుట ॥ నసువులుడిగి
యీల్గరే యెందఱెందరో ॥ యెఱుఁగవొక్కొ!
అన్నభార్యను దయతోడ ॥ నరయుమయ్య!

క్రూర:—(బిగ్గఱగా నవ్వి) అహో! ఎంతధర్మ మేకరవు పెట్టితివి. పరకాంతలనుగోరి రావణాదులు మడిసిరనికదా నీవు చెప్పుచున్నావు? నేనును వారివలె వికతజీవుండ నయినఁ గానచ్చును. కాని





నీ సాంగత్యమును గోరకమానను. నా మానసము నీయందు లగ్నమై యున్నది.

కమల:—(తనలో) భగవంతా! ఇఁక నాకేదిగతి? (ప్రకాశముగా) అయ్యా! లోకముల అందగత్తె లెందఱు లేరు; సర్వసమర్థుండ వగు నీవు తలంచినచో, వేనకువేలువచ్చి నీపాదములకడ వ్రాలుదురు - నేనా? నీకంటె వయసున బెద్దదానను; వృద్ధాప్యము తొంగి తొంగి చూచుచున్నది. దుఃఖభారమునఁ బరితపించుచున్నాను. ఇష్టము లేనివారితోడి సరసము నీకు సంతోషము గలుగఁజేయదు; కాఁబట్టి వేఱొక యువతినిడాసి, నీ కామమును దీర్చుకొమ్ము.

క్రూర:—(నవ్వుచు) ఎంతమాటకారివి? నీ నక్కజిత్తులు నాయొద్ద సాగవు. ముసలిదానివయినను—రోగిష్ఠివయినను-కురూపిణివయినను నీవు నాకన్నుల కందగత్తెవు. తానువలచినది రంభ! నీవు నాపాలిటి రంభవు—మాఱుమాటలాడక, నాకోర్కెఁదీర్పుము. లేకున్న బలాత్కరించెదను.

కమల:—(తనలో) అకటా! ఇపుడు నన్ను రక్షించువారెవ్వరు? నా యార్తిం బాపువారెవ్వరు? ఇపుడు నాకేది కర్తవ్యము? (కొంచె మాగి) పతివ్రతలకు మానమే ప్రాణము. మహోత్కృష్టమగు మానమును రక్షించుకొనుటకై ప్రాణములయినఁ బాసెదను.

క్రూర:—సఖీ! ఏమి యాలోచించుచున్నావు. కాలాతీతమునకు హృదయ మోపకున్నది.

కమల:—పాపాత్ముఁడా! నీవు నన్ను ముక్కముక్కలుగఁ జెండినను, నేను నీకోరికను సమ్మతింపను. అదియే నాకడసారి నిర్ణయము.

క్రూర:—(వెడనవ్వు నవ్వి) ఆలాగునా? ఆలాగునా? ఇపుడెవరికొఱకు సమ్మతింతువో చూచెదఁగాక! (ప్రక్కకుఁదిరిగి) ఓ శూరపాల వీరపాలులారా! ఆ తారా కనకసింహుల నిటుఁ గొనితెండు.

కమల:—(దుఃఖించుచు) అయ్యో! అయ్యో! ఒక చెంపగొట్టిన నీరు—వేఱొక చెంపఁగొట్టిన పాలు—అన్నపున్నము లెఱుంగని పసి కూనలు. వారలతో నీకుఁ బనియేమి?

[అపుడు వీరపాల శూరపాలురు తారా కనకసింహులతోఁ బ్రవేశము]

తార:—హా తల్లీ! (ఆమె పాదములపైఁ బడును)

కనక:—హా! ఎట్టిదుర్దశ వాటిల్లినది? (అని తల్లిం గౌఁగిలించుకొనును)

క్రూర:—కమలా! ఆలోచించుకొనుము. తుదిపర్యాయమిది. దీర్ఘముగా ఆలోచించుకొనుము. (కత్తిందూసి)

గీ. కత్తి చేఁబూని వీరల కుత్తుకలను
గోయుమందువా? లేకున్న కోమలాంగి!
ప్రేమ ననుబొంది దుర్భర కామపీడఁ
బాపుమవ! యోజనముసేయు మానసమున.

కమల:—హా దైవమా! దైవమా! ఎంతటి నిర్దయుఁడవయ్యా! (క్రూరసేనుని పాదములపై(బడి) తండ్రీ! అపరాధిని నేను; నా కుత్తుకను గోయుము. పసిబాలురు. లోకవృత్తము నెఱుంగరు. వారిపై నీకింత కఠినత్వమేల?

క్రూర:—నీవు నాకోరికను మన్నింపకుండుటచేత—

కమల:—(తనలో) హా బిడ్డలారా! నాకడుపునఁ బుట్టినందుల కిదియా ఫలము? మానసంరక్షణార్థమై మిమ్మిప్పుడు—ఈ ఖలుని ఖడ్గధారకు బలియీయవలయునా? దుర్భరము—దారుణము—సహింపను—నేను కన్నులార మీచావును జూడఁజాలను. ఓ సముద్రుఁడా! ముందు నన్ను నీలోఁ బ్రవేశపెట్టుకొనుము.

(పరువిడుచుండఁగా క్రూరసేనుఁ డడ్డునిలుచును)

క్రూర:—ఎక్కడికిఁ బోయెదవు? మిత్రులారా! మీ రీ బుడుతలను సమీపమునఁ గల యరణ్యమునకుం దోడ్కొనిపోయి, యట వధించిరండు—

తార:—హా! విధీ!

కనక:—హా! తల్లీ!

కమల:—హా! బిడ్డలారా! (అని సముద్రమునఁ బడును)

(శూరపాల వీరపాలురు తారా కనకసింహులఁ గొంపోవుదురు)

క్రూర:—చావుముండా, చావు! నేఁటితోఁ బూర్తిగా పీడ వదలినది. ఇఁక నిశ్చింతగా నేనుండఁగలను. (నిష్క్రమించును)

(తెర పడును)

---

మూఁడవ రంగము—అరణ్యభూమి



[ ప్రవేశము వీరపాల శూరపాలురతో, తారా కనకసేనులు ]

తార:—హా దైవమా! నీకు మేమింత పగవారమైతిమా? అనాథ బిడ్డలమగు మమ్ము బలవన్మరణము పాలుసేయుచున్నావా? పూర్వ మార్తుల నెందఱినో రక్షించితివందురే?

సీ. ప్రహ్లాదుఁగాచిన ❘ భక్తవాత్సల్యంబు
ఏవీట దాఁగెనో ❘ యెఱుఁగఁజెపుమ!

కనక:. ద్రౌపది నేలిన ❘ రక్షణాపటిమ నేఁ
డెందుఁ బోయినదయ్య ❘ యెఱుఁగఁజెపుమ!

తార:— గజరాజు దయఁజూచు ❘ కౌతుకంబీలీలి
నేమాయెనో మాకు ❘ నెఱుఁగఁజెపుమ!

కనక— అంబరీషునిసాఁకు ఆర్తపాలనదీక్ష
ఏమూలనున్నదో ఎఱుఁగఁజెపుము!

తార:-గీ. భక్తరక్షణబిరుదంబు వడసియున్న
దేవ! ఈనాఁడు మమ్మేల వీవుచెపుమా!

కనక:— అల్పులము; దిక్కుమాలిన యర్భకులము;
తండ్రి! మా తలల్ దీయుట తగునెనీకు!

శూర:—(కోపముతో) పాపలారా! నడువ రేమి? మీ యేడ్పులు— మీ మొత్తుగడులు—ఆలించువా రెవ్వరు?

వీర:—(తనలో) పసిబిడ్డలగు వీరి నన్యాయముగ వధించుటకుఁ జేతులు రాకున్నవిగదా!

తార:—అన్నలారా! మమ్మేల నిష్కారణముగఁజంపెదరు? మావంటి బిడ్డలు మీకు లేరా? మీదిమాత్రము కన్నకడుపుకాదా?

కనక:—అయ్యలారా? మిమ్ములను బ్రతిమాలుకొందుము. మీ పాదములకు మ్రొక్కెదము. మమ్ముఁ గరుణించి విడిచిపెట్టుఁడు.

వీర:—శూరపాలా!

శూర:—(తనలో) వీఁ డసాసురుండు; ఏదియో క్రొత్తయెత్తు ఎత్తినాఁడు; వీనికి మాఱాడితినా నా ప్రాణములు నాకుఁదక్కవు. (ప్రకాశముగా) ఏమి?

వీర:—వీరిని జంపకుండ నీ యరణ్యమునందు విడిచిపోవుదము.

శూర:—క్రూరసేనుఁ డెఱింగినచో మనలను బ్రాణములతో నుండ నిచ్చునా?

వీర:—వానితోఁ జంపితిమనియే చెప్పుదును. నీకా భయ మక్కఱ లేదు. తగినరీతిని నేను చెప్పి నమ్మింతును.

శూర:—అయిన నీ యిష్టముం గానిమ్ము.

వీర:—బిడ్డలారా! మిమ్ములను జంపుటమాని యీ యరణ్యమున విడిచిపోవుదుము. మీరు మాత్రము క్రూరసేనుని కంటఁ బడరాదు.

తారా కనక:—(నమస్కరింపుచు) మంచిది; తండ్రీ! మంచిది. మేము నగరముం ద్రొక్కము.

వీర:—ఈ బట్టలను గట్టుకొని, మీ దుస్తులను వస్త్రములను మా కొసంగుఁడు.

తారా కనక:—(అట్లు సేయుదురు)

వీర:—శూరపాలా! రమ్ము. వీనిని మనము సమానముగఁ బంచుకొందము. పిల్లలారా! మఱియొకసారి హెచ్చరించుచున్నాను. జాగ్రత! క్రూరసేనుని కంటఁబడరాదు.

(ఇరువురు నిష్క్రమింతురు)

తార:—సోదరా! దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు.

కనక:—లేకున్న వీరి మనస్సింతలోనే యిట్లేల మారవలయును? ఆ మహాత్ముఁడే అనాధబిడ్డలమగు మనలను రక్షించినాఁడు.

తార:—సోదరా! అయ్యో! మన కెట్టి కష్టములు ప్రాప్తించినవి? ఆ భగవంతుఁడు బాల్యమునుండియే మనల నిట్లు కష్టముల పాలు సేయుచున్నాఁడు. తండ్రి హతుఁడాయెను; తల్లి మానసంరక్షణార్థమై సముద్రములోఁ బడినది. హా విధీ!

కనక:—అక్కా! విచార ముడుగుము. దుఃఖించిన నేమి ప్రయోజనము. కర్మఫలము కాఁబోలు నిది. అనుభవింపక తీరునా?

తార:—సోదరా! అబ్బా! మిక్కుటముగ దాహమగుచున్నది. నోరెండిపోవుచున్నది. హా దాహము! దాహము!! (మూర్ఛిల్లుచు)

కనక:—అయ్యో! దాహపీడచే నీమె నేలఁబడి మూర్ఛిల్లినది. నిర్మానుష్యము. దుర్గమము నగు ఈ యరణ్యములో జల మెక్కడ

దొరకునుకి వెదకి పురిసెడు నీరు దెచ్చి అక్క నోటిలోఁ
బోయుకున్న యీమె ప్రాణము లుండవు. కష్టము లొంటరిగ
రావు కాఁబోలు!

(నిష్క్రమించును)

[అపుడు మారఁడను దొంగలనాయకుఁడు ప్రవేశము]

మార:—(పరుగునఁబోయి తారనుజూచి) బలే! బలే! ఇన్నోళ్లకి కలి
గింది కటాచ్చం తల్లికి "నరబలి, నరబలి—కన్నెపిల్ల కావాలి.
అప్పుడుగాని పతేచ్చిగంకానని" సెపుతూవుండాది కాళికాదేవి.
సంతోసగం కలిగేటట్లు ఈమె కంటబడింది. ఎవరో రాసోరి
పిల్లలాగుంది. నిద్దరోతోంది. మంచిసమయం. తల్లీ! కాళమ్మ
తల్లీ! నీకీ కన్నెపిల్ల రత్తం దారోత్తా! ఈమె మాంసాన్ని నం
జుడు పెడ్తాను. అప్పుడు నాకు పతేచ్చిగంఅయి, కోరిన వరా
లిత్తావు. నేటికి నాతపం పండాది.

(అని మూఁపునఁ దార నిడుకొని గొంపోవును)

(తెర పడును)

ద్వితీయాంకము సంపూర్ణము.





ఓమ్

# కనకతార



## తృతీయాంకము



### మొదటి రంగము—పల్లెవాని యిల్లు



[ ప్రవేశము పల్లిగాఁడు—కమల ]

పల్లి:—సెప్పే; నీ కేటా మొగమాటం? సముద్దరంలోపడి సచ్చే దాన్ని వలేసి తీసినానుకాదే?

కమల:—(తనలో) హా దైవమా! ఎట్టి కష్టములను గూర్చుచున్నావయ్యా! మానసంరక్షణార్థమై క్రూరసేనుని బారినుండి తప్పించుకొనుటకు, సముద్రములోఁ బడఁగా నన్నీతఁ డేల పైకి దీయవలయును? తీసినవాని కిట్టి దుర్బుద్ధి యేల పుట్టవలయును? అకటా! విశ్వవిఖ్యాతచరిత్రుఁడైన యుదయసేనభూపాలుని కర్థాంగినగు నేను—తుదకుఁ జేపలువట్టుకొను పల్లెవానికిఁ గూడ లోకువయితినా?

పల్లి:—సెప్పవోలే? నాకు దేగంలో యేడిపుడ్తా వుండాది. నిన్ను సూసినకాడ్నుంచీ, యేదో పుడ్తావుండాది మన్సులో—

కమల:—అన్నా! నీ కిది ధర్మమా! సముద్రములోఁబడి చావనున్న దానిని నన్నేల బయటికిఁ దీసితివి? తీసినందుల కిట్టి కోరికను

గోరుట భావ్యమా? నీ పాదములకు ప్రొక్కెదను తుచ్ఛములగు కోరికలు కోరవలదు.

పల్లి:—యేటోలె? ఒల్లకుంటుంటే తెగనీల్గుతూ వుండావు; నాకేటి లోటే? సుక్కలో సందురుడులాగున్నాను. మగరాయణ్ణి—వలేసుకుపోనానంటె కావలసినన్ని సేపలు పడ్తాను. రోజుకు పది రూపాయిలు సంపాదకం సేస్తాను. కులపెద్దను. నన్నే వొల్లకపోతే, నా కంటే మంచోడు నీరేడులోకాల్లో ఇంకో డెవడు దొరుకుతాడే!

[ అంత త్వరితగతిని చీపురుకట్టతో, పుల్లి ప్రవేశము ]

పుల్లి:—(తనలో) ఈ గండడు ఓ రాసోరి పడుచుని వలొడ్డి తీసేడని సాటి జాలారోళ్లు సెప్పగా సక్కావచ్చినాను (పరిక్రమించి) ఇక్కడే వుండా రిద్దరూ. (సమీపించి) నీ జింవడ? నిన్ను నూకాలమ్మ మింగెయ్యా! ఉన్నదాన్ని సాలినానుకాదురా నీ మొగానికి? ఈ రంకులా డెందుకురా?

(చీపురుకట్టతో కొట్టుచున్నది)

పల్లి:—ఉండవే-పుల్లీ—నీపాదలకు మొక్కుతాను—ఉండవే-దీన్ని సూసిన కాడ్నుంచి మన్నుమన్నులానోదు. ఎంతబతిగిమాల్నా ఒప్పకుంటున్నాది.

పుల్లి:—(పల్లిగానిని గట్టిగా పట్టుకొని) నాకాపురం సెడకొడ్డడానికటే వచ్చేవు? పో! ముండా! జాలారిపల్లెలో ఇంకొతపా కనపడ్డావంటే నిన్ను సేపముక్కలాగి తరిగి ఉప్పుపాత్తరేత్తాను—పో. రారా! పల్లిగా! (లాగుకొని పోవును)

కమల:—తల్లీ! సమయమున కరుణించి నన్ను రక్షించినందులకు నీకిదే నమస్కారము! హా భగవంతుడా! ఇంకను నీకు దాక్షిణ్యము

కలుగలేదా? పగసాధింపఁబూనితివా? నేను చేసిన యపరాధ మేమి? మహత్తరగుణవంతుఁడగు భర్తను వధింపఁజేసితివి. కన్న సంతానమగు బిడ్డల నిరువురను దారుణవధ గావించితివి. హా తారాశశకసింహములారా! అయ్యో! బిడ్డలారా! పాపాత్మురాల నగు నాగర్భమున నెందులకు జన్మించితిరి? మఱియొక యువతికి జన్మించినచో గంజియో, అంబలియో త్రావి సుఖముగా ప్రాణములతోనయిన నుందురుకదా! నా కడుపునఁ బుట్టినందులకుఁ జిత్రవధ గావింపఁబడిరా? అయ్యో! నేనెంత కఠినహృదయను? ఎట్టి పాపాత్మురాలిని? భర్త వధింపఁబడిన వెనుక—పిల్లల కుత్తుకలు కఱకుఁ గత్తి కెఱయయిన పిమ్మట నేనింకను మొండినై బ్రదికియుంటిని.

గీ. భర్తగతియించె; బిడ్డలు ♦ వనమునందుఁ
గటికి కత్తికి గురియయి ♦ కడచినారు;
'అక్కటా! నేను మొండినై ♦ స్రుక్కనేల?
ప్రాణములఁబాయుటే యుత్త ♦ మంబుగాదె?

సముద్రములోఁబడి తనుత్యాగమొనరింప నీవిధ మయినది. కనుక నిఁక నే యరణ్యములకైనఁ బోయినచోఁ గిటి కేసరి శార్దూల గండభేరుండాది క్రూరమృగములలో నేదియో యొకటి నన్నుఁ దినివేయును. దానితో నాకష్టములు గట్టెక్కును.

(నిష్క్రమించును)

(తెర పడును)

---

## రెండవ రంగము—మహారణ్యము



[ ప్రవేశము విజయసింహుఁడు సుమంత్రి ]

విజయ:—సుమంత్రీ! మనమీ యరణ్యమధ్యమునే యీరాత్రి సేనలతో నుండవలయునని తోఁచుచున్నదే! చీఁకటిపడుట మార్గము కనిపింపదు. కాని నా హృదయము ప్రాణమిత్రుఁడగు ఉదయసేన భూపతిని నిద్రలో వధించి వాని యాలిని బలాత్కరించి, బిడ్డలను హత్యఁజేయఁ బంపి, క్రూరసింహుఁడు సింహాసనాధిష్ఠుఁడాయెనని, సేవకాధిపుఁడగు సులోచనుఁడు పంపినవార్తను విన్నదిమొదలు—ఆదుర్మార్గుని ససైన్యముగ నెప్పు డెదుర్కొందుమా యని వేగిరపడుచున్నది.

[ అపుడు దొంగలనాయకుఁడగు మారఁడు ప్రవేశించి, చాటున డాఁగి యుండును ]

సుమం:—రాజశేఖరా! తొందరపడనేల? ఈ రాత్రి యిట విడిసి పిమ్మట వేకువజామున నే లేచిపోయి ఆ క్రూరసేనుని శిక్షింతము.

మార:—(తనలో) ఈరాసోరిసిన్నాడోడో—కబుర్లుసూత్తే మాదొరయ్యా కూరయ్యగారిమీదికి దండొత్తేలాగుండాదు. కానీ యీరాత్తిరే పట్టుకొని యిాన్నిక్కడ బందిలోపెడ్తాను.

విజయ:—మంత్రీ! నీవు చెప్పినట్లే చేయఁదగును. వనమంతయుఁ గంటకావృతము—క్రూరమృగాలవాలము—అంధకార బంధురము. సేనలు దూరమున విడిసినవి. ప్రస్తుతము మన మెక్కడ విశ్రమింతుము?

సుమం:—మహారాజా! ఈ యరణ్యములో మనకు సుఖమెక్కడ. ఈ వృక్షముక్రింద విశ్రమింపుఁడు. ఖడ్గధారినై నేను గాపుండెదను.

విజయు:—(అట్లు చేయును)

మార:—(తనలో) నేను పోయి మా గుంపోళ్లని లాక్కొచ్చి యీళ్ల నిద్దరిని పట్టుకొని బండిలో పడేత్తాను. దొరయ్యా కూరయ్యా సంతోసించి బగుమతులిత్తాడు. (నిష్క్రమించును)

(తెర పడును)

---

## మూఁడవ రంగము—అరణ్యము



[ ప్రవేశము కనకసింహుఁడు ]

కనక:—(దుఃఖించుచు) అక్కా! అక్కా! అయ్యో! దుర్భర దాహ వేదనాపీడితవై "జలము. జలమ" ని కేఁకలిడఁగాఁ గొని తెచ్చుటకై పోయితినిగదా! జలముం గొని తెచ్చులోపల నీవే మయితివి? అక్కా!

సీ. సింహశార్దూలముల్ । చేరి క్రూరంబుగ
నినుఁబొట్టలోఁ బెట్టు । కొనెనె చెపుమ!
దారుణదస్యుఁ డే । క్రూరుఁడై నను వచ్చి
తనవాతఁ బడఁవేసి । కొనెనె చెపుమ!
దాహపీడితవై । తనువునుద్యజియింప
వనమృగంబులువచ్చి । తినెనె చెపుమ!
తమ్మునిపై మదిఁ । దామసంబొదవఁగా
ననువీడి యొందయినఁ । జనితె చెపుమ!

గీ. అక్కటా! పుట్టినది మొదల్ । వెక్కసపడి
యెఱుఁగ వీవు; నిర్భాగ్యుఁడం । చెంచియిపుడు
వదలితివె నన్ను, నినువీడి । బ్రతుకఁగలనె?
జాడఁ దెలియదు నింకేమి । సలుపువాఁడ!

హా దైవమా! అటు దండ్రిని హత్యఁజేసితివి; తల్లిని సముద్రములో ముంచితివి—మమ్ముల నీరీతిని వేఱుపరచితివి. నీకు మా కుటుంబము నింత యాగ్రహమేల? లోకములో ధర్మపరాయణులు సుఖింతురని పెద్దలందురే? అది కల్ల. వట్టిమాట! ధర్మమున కీ యుగమునఁ దావులేదు. సత్యమునకుఁ జోటులేదు. న్యాయమున కాశ్రయము లేదు. హంతకులకు—అధర్మపరాయణులకు సుఖము—ఐశ్వర్యము—అభివృద్ధి కలుగుచున్నది. అదియే నిజము గాకపోయిన సద్ధర్మనిరతుఁడగు నా తండ్రి కట్టి దురవస్థయా? మహాపతివ్రతామతల్లి యగు మా తల్లి కట్టి దుర్మరణమా? అన్నె పున్నెము లెఱుఁగని కసుగందులమగు మా కిట్టి యిక్కట్టులా? (కొంచెమాఁగి) ఇపుడు నా కేది కర్తవ్యము? ఎవరు శరణ్యము? ఆఁ! ఒకరిని శరణువేఁడనేల? తల్లిని గోల్పోయి, తండ్రిని గోల్పోయి, అక్కని గోల్పోయి, నే నొక్కరుండను మొండినై బ్రతుకనేల? బ్రతికి చేయున దేమున్నది? నావంటి నిర్భాగ్యుఁ డున్న నేమి? ఊడిన నేమి? నా కొఱకు విలపించువా రెవ్వరు? నా యోగక్షేమముల నరయువా రెవ్వరు? ఏకాకినై అడవులలోఁబడి కట్టుటకు గుడ్డ—కడుపున కన్నము లేక బ్రతికియుండనేల? ఈ రాతిబండపైఁ దలను గొట్టుకొని చనిపోవుదును. (బండను సమీపించి, చేతులు జోడించి) ఈశ్వరా! నీ వెంత నిర్దయుఁడవైనను, ఎంత పగసాధింపుచున్నను—నేను మాత్రము నిన్ను మరువఁజాలను.

గీ. దేశమును బాసి యీరీతి దిమ్మరినయి
బంధుగులు చుట్టములును, ఎవ్వరును లేక
అడవిలోఁబడి కష్టంబు లందఁజాల!
తనువుఁ బాసెద; రక్షింపు తండ్రి! నన్ను.

[ అని తలను బ్రద్దలుకొట్టుకొనఁబోవఁగా నొక ముని ప్రవేశము ]

మునిః—బాలకా! బాలకా! మరణింపవలదు—సాహసము విడువుము.

మదీయ తపఃప్రభావంబుచే నీ వృత్తాంతం బెఱింగితిని.

కనక:—దేవా! మీ రెవ్వరు? దిక్కుమాలినవాఁడ నగు నాతో మీకుఁ బనియేమి? నన్నెందులకు జావనీయరు?

ముని:—ఓయీ! నీవు మాఱుమాటాడక, వెంటనే బయలుదేరి తూర్పు దిక్కుగాఁ బొమ్ము. నీకు సర్వశ్రేయము లొదవును—సందేహము వలదు. ఆలస్యము సేయకుము. మహర్షి నగు నా మాటను గాదనకుము. నే నేఁగుచున్నాను.

(నిష్క్రమించును)

కనక:—భగవంతా! స్వామీ! నీ చర్యలు దురవగాహములు; నీ లీలద్భుతంబులు. ప్రాణములయందలి యాసం ద్యజించి, నీలోఁ జేరనుండఁగా మరల నిది యొకటా! కానిమ్ము. నీ యిష్టము వచ్చినట్లు చేయుము. దేహధారులెల్లరు నీ చేతులందలి కీలుబొమ్మలుగదా! ముని వచన మనుల్లంఘనీయము—తూర్పు దిక్కుంబట్టి పోయెదను.

(నిష్క్రమించును)

( తెర పడును )

---

## నాల్గవ రంగము—అరణ్యము

[ ప్రవేశము కమల— వీరసింగు ]

కమల:—అయ్యో! ఆ వ్యాఘ్రరాజము నా యందుఁ గనికరించి, నన్ను దన పొట్టం బెట్టుకొనఁగోరఁగా నీ వేల దానిని వారించితివి? నిర్భాగ్య నగు నా కింకను కష్టములు తప్పవా?

వీర:—అమ్మా! నీ మోమున దీనత్వము పొడసూపుచున్నది. మాటల యందు విరక్తిభావమున్నది. కోరి చావుం దెచ్చుకొనునంతటి కష్టము నీ కేల? నీ వృత్తాంత మెఱింగింపుము.

కమల:—(తనలో) ఆహా! నాథుఁడు గతించినపిమ్మట నెన్నిదినములకు సత్పురుష సందర్శనమయినది? ఈ మహాభాగుఁ డెవ్వఁడో ధర్మపథగామి. (ప్రకాశముగా) తండ్రీ! నే నొక దిక్కుమాలినదానను. అనాథను. నా వృత్తాంతముతో నీకుఁ బనియేమున్నది. మరణింపనుండఁగా నది తప్పించితివి. ఇఁక నెట్లు బ్రతుకుదునని మాత్రము నాకు విచారమగుచున్నది.

వీర:—తల్లీ! నీ వొక మహాపతివ్రతవు; సంపన్నగృహస్థురాలివి; కాల కర్మవశముచేఁ గడగండ్లపాలై యున్నావని నాకుఁ దోఁచు చున్నది. నీ యందు నాకు భక్తిభావములు కుదిరినవి. మా యింటికి దయసేయుము. అక్కడ స్వేచ్ఛగా నుండుము. నా కిరువురు భార్యలు గలరు. గృహకృత్యములను నీ వేమియుఁ జేయనక్కఱలేదు. నిన్నత్యంత గౌరవముతోఁ జూతుము. సందేహ ముడిగి నా వెంట రమ్ము.

కమల:—(తనలో) దైవమా! మరల నిది యొక సంఘటనమా? కానిమ్ము; నీ లీలల నతిక్రమించుట కెవ్వరికి శక్యము. (ప్రకాశముగా) ఓ పుణ్యపురుషా! నాయందిట్టి వాత్సల్య మూని నందులకు నేను కృతజ్ఞురాలను. నా యాజ్ఞం బాటింతును.

వీర:—తల్లీ! సంతోషము! రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

( తెర పడును )

తృతీయాంకము సంపూర్ణము.

---



# కనకతార



## చతుర్థాంకము



### మొదటి రంగము—విజయసింహుని నగరు



[సింహద్వారమువద్ద భటుఁడు]

భటుఁడు:—(తనలో) అకటా! నేఁటి కనేకదినములు గడచిపోయినవి. విజయసింహమహారాజుగారి జాడ యావంతయుఁ దెలియలేదు గదా! మిత్రుఁడగు నుదయసేనమహారాజు సోదరునిచే హత్య కావింపబడె నన్న వార్తను వినుటతోనే ససైన్యముగ వానిని దండించుటకై పయనమైపోయిరి. ఒకనాఁ డరణ్యమున నిశీథ మగుటచే విశ్రమించిరఁట! తెలివిమాలిన యీసైనికులు పరిసరముల విడిసిరఁట! కాని యదేమిపాపమో! తెల్లవారిన పిమ్మట నెందు వెదకినను రాజుగారు కనఁబడలేదఁట! వారికిఁ గావలిగాయుచున్న మంత్రి మస్తకము తెగి పడి యున్నదఁట! అబ్బా! రాజుగారి జాడఁ దెలియుటకు నగరులోని యమాత్య చమూపతు లెంత ప్రయత్నించిరి! కాని యేమిలాభము! ఎందఱు చారులేఁగిన నేమి? ఎన్ని దేశములు తిరిగిన నేమి? అంతయు నిష్ఫలమే! రాజు లేకుంటచే రాష్ట్రమున అరాజక

మధిక మగుచున్నది. పురోహితులవారి యాజ్ఞానుసారము ఈ సింహద్వారమున దుర్గం బ్రతిష్ఠించిరి. ఎవ్వఁ డీ కవాటముం దెరచుకొని లోనఁ బ్రవేశింపఁగలఁడో వానిని రాజ్యాభిషిక్తునిగాఁ జేయుట కమాత్యచమూపతు లువ్విళ్లూరుచున్నారు. ఇన్ని దినములు గడచినవి యెవ్వరు రాలేదు. (ప్రక్కకుఁ జూచి) అహో! నవమన్మథాకారునివలె నున్న యీ బాలుఁడెవ్వఁడు? ఇటులనే వచ్చుచున్నాఁడు.

[అపుడు కనకసింహుఁడు ప్రవేశము]

కనక:—ఓయి! ఈ భవన మెవ్వరిది? మార్గాయాస ముపశమించుకొనుట కిందించుకసేపు విశ్రమింపవచ్చునా?

భటు:—మీ రెవ్వరు?

కనక:—నేనొక రాజకుమారుఁడను.

భటు:—ఆ కవాటముం దెరచి లోనికిఁబొండు.

కనక:—(కవాటముం దెఱచి లోనికిఁబోయినాఁడు)

భటు:—(సంతోషముతో) ఆహా! ఈ మహాత్ముఁ డెవ్వఁడో! అవలీలఁగాఁ గవాటముం దెఱచి లోనికిఁ బోఁగలిగెను! నేటితో మా కష్టములు గట్టెక్కినవి. నేనుపోయి అమాత్యశేఖరున కెఱిఁగింతును. (నిష్క్రమించును)

( తెర పడును )

---

రెండవ రంగము—అరణ్యము



[ తెర యెత్తఁగా ప్రవేశము విజయసింహుఁడు]

విజయ:—(తనలో) అన్నన్నా! ఈ దుర్మార్గులగు దొంగలు నన్నెంత పని చేసినారు! నాఁటిరాత్రి చెట్టుక్రింద విశ్రమించియుండఁగా

గుంపులుగా వచ్చి మంత్రింజంపి, నిద్రితుండనగు నన్ను మత్తు మందు సహాయముతోఁ గొనివచ్చి యీ చెఱలోఁ బడవేసిరి. కానిమ్ము. వారికిప్పుడు తగినట్లు చేసితిని. మోసమునకు మోసమే ప్రతిక్రియ యని తలంచి, తప్పత్రాగి యొడలెఱుంగక పడియున్న యీ దొంగల కన్నులలోఁ గారముంగొట్టి చెఱ సాలనుండి యీవలఁబడితినిగదా! ఇఁక నిక్కడఁ దడయరాదు. ఆఁ! తడసిన నేమిభయము? హస్తమునందు ఖడ్గమున్నది. దొంగ లొక్కరుకాదు పదివేలమంది వచ్చినను వారి కుత్తుకలం బట్టి పటాపటఁ గోసెదను. నేఁడే వారు మత్తుమందు జల్లకున్న యెడల నేను వారికిఁ జిక్కుదునా?

[నేపథ్యమున హాహాకారము]

**విజయ:**—(ఆలకించి) ఆఁ! ఏమిది? ఈ దుర్గమారణ్యములోఁ గోకిల స్వరమును మరపించు మృదులస్వరముతో హాహాకారము సేయుచున్న యీ అబలయెవ్వరు? (ప్రక్కకుఁజూచి) ఔరా! ఏమి వాని దారుణము! ఏమి వాని సాహసము! నాపై మత్తు మందుఁ జల్లి నన్నుఁ జెఱఁబెట్టిన దొంగలనాయకుఁ డగు ఆ మారఁడే యొక కన్యకామణిని మూఁపునఁబెట్టుకొని, గుడికి మేఁకపోతుం దీసికొనిపోవునట్లు గొంపోవుచున్నాఁడు. నేఁడు నా కత్తికిఁ బని తగిలినది. ఇక్కడ ఆలస్యముచేయక, పోయి, ఆ దుర్మార్గుఁడా బాలిక నెందులకుఁ దీసికొనిపోవుచున్నాఁడో ఎక్కడకు వెళ్లుచున్నాఁడో తెలిసికొనెదను. (నిష్క్రమించును)

(తెర వ్రాలును)

---

## మూఁడవ రంగము—కాళికాలయము



[ ప్రవేశము మారఁడు, తార—చాటున విజయసింహుఁడు ]

మార:—పిల్లా! ఎందుకేడుత్తావు. మొక్కుకో. కాళికాలమ్మోరికి కడసారి మొక్కుకో! నిన్నేలాగా బలియ్యకమానను.

తార:—(ఏడ్చుచు) హా! భగవంతుఁడా! అనపరాధినగు నన్నిట్లు దుఃఖపెట్టుట న్యాయమా? నేను దుశ్శీలనుగానే! అసత్యము లాడలేదే! అన్యాయము లొనరింపలేదే! అధర్మములు సేయలేదే! అన్నెపున్నెము లెఱుఁగనే! లోకవృత్తమును గ్రహింపనే! అమాయకురాలినే! తండ్రీ! నన్నింత కష్టపెట్టనేల? తల్లిదండ్రులులేని బిడ్డం జేసితివి. ఏకైకసోదరుండగు కనకసింహుని వీడఁజేసితివి. అతిభయంకరుఁడైన దొంగలతేని చేతిలోఁ బడవైచితివి. ఇన్నిదినములవఱకుఁ జెఱయుందుంచితివి. ఇంకను నీపగ దీరలేదా? ఇంకను నీకు సంతృప్తి కలుగలేదా? నా చావునుగూడఁ జూచి సంతోషింపఁదలఁచితివా? అట్లయిన నాకు సహజమరణముం గల్పించి నాకు నీ సాన్నిధ్య మొసంగరాదా? ఈ కటికిక త్తితో గుత్తుకను గోయింపనేల?

విజయ:—(తనలో) ఏమి? ఈమె మాటలంబట్టి చూడఁగా ఉదయసేనుని పుత్రిక యగు తారవలె నున్నది? ఇంచుకసేపు తాళెదను. సమయముజూచి యీ దస్యుని కంఠము నెగురవేసెదను.

మార:—ఎందుకేడుత్తావుపిల్లా! నీకు సావుతప్పదు. నే నెన్నోరోజుల కాడ్నుంచి, మా కాళికామ్మోరిని పతేద్చిగం సేసికోవాలని కోర్తుండాను. కన్నెపిల్లను బలిత్తేనేగాని, పతేచ్చిగంకానంది. దొరక్క దొరక్క నాకు దొరకినావు. నిన్నొగ్గుతానా?

ఒగ్గను. కనుక కడసారి మొక్కుకొని సంతోషకరంగా చావు. తప్పనప్పు డేడు పెందుకు.

తార:—తల్లీ! కాళీ!

గీ. ప్రతిదినంబు దినుచున్న పశుగణంబు
చాలదంచుఁ దలంచితే స్వాంతమందు?
ఆర్తనగు నన్ను రక్షింప మాని యిట్టు
లకట! భుజియింపఁజూచెదే అంగదడఁగ!

తల్లీ! పరాశక్తివగు నీకే యిట్టి పాడుబుద్ధి పుట్టినదా? దీనరక్షణము నీకు దూరమైనదా? దుష్టశిక్షణ మహితమైనదా? (మారని కాళ్లపైఁ బడి) తండ్రీ! నన్నేల నిష్కారణముగ వధింపఁజూచెదవు? నేను నీ కొమరితవంటిదాననుగానా?

మార:—నాతో మాటాడొద్దు. నేను కత్తి నూరుకొనులోపున అమ్మోరికి మొక్కుకో—లేకపోతే మానీ!

(అని కత్తిని నూరుచున్నాఁడు)

విజయ:—(తనలో) నా కిదే సమయము. ఇపుడీ దుర్మార్గుఁడు పారిపోఁజాలఁడు.

తార:—హా దైవమా! నన్ను రక్షింపవా? ఓ సూర్యచంద్రములారా! ఓ భూతములారా! ఓ అష్టదిక్పాలులారా! మీరయిన నాకీ భయంకరమరణమును దప్పింపరేడు.

విజ:—అమ్మా! భయపడకుము. నిన్ను రక్షింప వచ్చుచున్నాను. (అని ముందుకు లంఘించి మారని తలఁ దెగ వేయును. మారఁడు క్రిందఁబడి కిలకిలఁ గొట్టుకొనుచుండును)

విజ:—చావుము. దుర్మార్గుఁడా! నీ వొనర్చిన దుష్కార్యముల కిదియే ఫలితము.

తార:—ఓ మహాత్మా!

గీ. యక్షుఁడవొ! సిద్ధుఁడవొ! లేక ✽ యమరుఁడవొ, స
మయమునకు వచ్చి నా పంచ ✽ ప్రాణములను
రక్షణము సేసితివిగాదె? ✽ రమ్యగుణుఁడ!
ఎటులఁదీర్తును నీ ఋణ ✽ మేను చెపుమ!
(అని వాని పాదములపైఁ బడును)

విజయ:—బిడ్డా! లెమ్మమ్మ. వగవకుము. నేను నీవు తలంచినట్లు దేవతను గాను. మానవమాత్రుఁడనే! విజయసింహుఁడను భూపాలుఁడను.

తార:—(ఆశ్చర్యముతో) ఏమి? నీవు నా జనకుఁడగు ఉదయసేన భూపతికిఁ బ్రాణమిత్రుండగు విజయసేనుండవా? హా తండ్రీ! (అని పాదములపైఁ బడును)

విజయ:—(తనలో) నా యూహ నిజమైనది. (ప్రకాశముగా) పుత్రీ! ఏల విచారింతువు. దుఃఖముడుగుము. ఖలుండగు క్రూరసేనుఁడు నీ జనకుని హత్య గావించినాఁడని విని, ససైన్యముతో నా దుర్మార్గుని దండించుటకై బయలుదేరితిని. ఈ యరణ్యముగుండఁ బ్రయాణముసేయుచు నొకనాఁడు అమాత్యసమేతుండనై నిశీథమగుటచేఁ బ్రయాణము సేయనోపక వృక్షచ్ఛాయను విశ్రమించితిని. అట్టితఱిని నిన్ను గొనివచ్చిన యీ ధస్యుఁడే నా మంత్రిం జంపి, నాకు మత్తుమందిచ్చి, నన్నుఁ జెఱఁబెట్టినాఁడు. ఈ దినమునఁ గావలివాండ్రను మోసపుచ్చి, బందిం దప్పించుకొంటిని. నిన్ని మారఁడు గొనివచ్చుటచూచి, నే నిక్కడకు వచ్చి చాటున నిలువఁబడి వినుచుంటిని. అమ్మా! ఇది నా వృత్తాంతము.

తార:—(కన్నీరు గార్చుచు) ఆహా! విజయసింహభూపాలా! మిత్రవాత్సల్యముచేత నెట్టిచిక్కులకు లోనయితివి?

విజ:—కుమారీ! నీ జనని యేమయినది? సోదరుఁడు కనకసింహుఁ డేఁడి? నీవీ దుర్మార్గున కెట్లు వశమయితివి?

తార:—(దుఃఖించుచు) అయ్యో! తండ్రీ! ఏమని చెప్పగలను? ఖలుఁడగు క్రూరసేనుఁడు మా తల్లిం బలాత్కరింపఁబోవఁగా—ఆ మహాసాధ్వి సముద్రములోఁ బడినది. మమ్ముల నిరువురను దన యనుచరులచేఁ జంప నొక యరణ్యమునకుఁ బంపినాఁడు. భగవదనుగ్రహముచేత, ఆ క్రూరసేనుని యనుచరులలో నొకఁడు మాయందుఁ గనికరించి మమ్ములను జంపక, విడిచి పెట్టినాఁడు. అంత నేనును సోదరుండును, అరణ్యమునఁబడి పోవుచుంటిమి. నేను దుర్భరంబగు దాహపీడచే నేలఁబడి మూర్ఛిల్లితిని. అపుడు సోదరుఁడు కనకసింహుఁడు జలముం గొని తెచ్చుటకుఁ బోయినాఁడు. పిమ్మట ఏమయినదో నే నెఱుంగను. నాకు స్పృహవచ్చుసరికి నే నొక చెఱయం దుంటిని. ఈ దినమున నిపుడు నీచే హతుఁడైన యీ దస్యుఁడు నన్నుఁ గాళికాదేవికి బలియిచ్చెదనని తీసికొనివచ్చినాఁడు. పిమ్మట నీ వెఱింగినవిషయమే! (కొంచెమాఁగి) తండ్రీ! నా సోదరుఁడు కనకసింహుఁ డేమాయెనోగదా!

విజయ:—అమ్మా! నీవు విచారింపవలదు. చీకటిపడుచున్నది. రమ్ము. మనమీ యరణ్యముం దాఁటిపోవుదము. కొలఁది రోజులలోనే మనము పురముం జేరఁగలము. పిమ్మటఁ జారులనుబంపి, నీ సోదరు జాడలందెలిసికొనవచ్చును. (ఇరువురు నిష్క్రమింతురు)

(తెర పడును)

---

## నాల్గవరంగము—వీరసింగు లోఁగిలి



[ ప్రవేశము వీరసింగు రెండవభార్య కుముదాబాయి ]

కుముదా:—(తనలో) లోకములో, సవతిపోరు పడుట కష్టముగదా! ఎక్కడో, అరణ్యములో పెద్దపులి చంపనున్న యువతిని మా నాధుఁడు రక్షించి వెంటఁబెట్టుకొని యింటికిఁ దీసికొనివచ్చి నాఁడు. ఆమె యప్పటినుండి మా యింటనే యున్నది. కాని యదేమిచిత్రమో ఆమె యెల్లప్పుడు నా సవతి యగు రాధా బాయిపక్షముననే మాటలాడుచుండును. ఆమెబిడ్డల నెక్కుడు ముద్దుగాఁ జూచును. నేఁటితో నేను చేసిన పనిమూలమున నిఁక నా సవతికి బిడ్డఁడేఁడీ! పాలలో విషముగల్పి యా బుడు తనికిఁ ద్రాగుమని యిచ్చితిని. అతఁ డది త్రాగినాఁడు. అప్పుడే చచ్చినాఁడు. నేరము నామీఁదఁ బడకుండ మా యింటనున్న ఆ యువతియే బాలునిం జంపినదని భర్తతోఁ జెప్పితిని; కృత్రిమముగా నేడ్చితిని. ఉపాయమున్నచో సాధింపరానికార్య మేమున్నది?

[ తెరలో కలకలము ]

(ప్రక్కకుఁ జూచి) సెబాస్! నాది తెలివి. నాది యుక్తి. నేను చేసిన నేరమున కామెను రాజభటులు గొనిపోవు చున్నారు. ఏదో యించుక పుణ్యము చేసినది. అందుచేతనే నాఁడు పెద్దపులి నోటిలోఁ బడి చచ్చుచుండ నేఁటివఱకు బ్రతి కినది. నేఁడు నేను చేసిన నేర మీయామెమీఁద మోపఁబడుట వలన మరణదండన మీయామెకుఁ దప్పదు. ఇఁక నేను పోయె దను. సాక్ష్య మీయవలసియుండు నేమో! (నిష్క్రమించును)

( తెర పడును )

చతుర్థాంకము సంపూర్ణము.





ఓమ్

# కనకతార

## పంచమాంకము

### మొదటి రంగము—సభాస్థలి

[ తెర యెత్తగా సింహాసనమునఁ గనకసింహుఁడు-సువర్ణుఁడను మంత్రి-భటుఁడు-వీరసింగు-కమల-కుముదాబాయి]

కనక:—సువర్ణా! ఈ ముగ్వురికి సంబంధించిన నేరములో మన భటుని ముందు విచారింపుము.

సువ:—భటుఁడా! నీకీ శిశుహత్యా నేరసందర్భమునఁ దెలిసినంతవఱకుఁ జెప్పుము.

భటు:—మహాప్రభూ! నేను వీధింబడి పోవుచుండఁగా వీరసింగుగారి భవనములో గందరగోళ ముదయించినది. అదేమైయుండునా యని నేను పోయితిని. అంత వారు తమ పెద్దభార్య పుత్రునకుఁ దమ యింటిలోనున్న యీమె విషమిచ్చి చంపినదని చెప్పిరి. అని (కమలం జూపును) తోడనే నామెను బంధించి తెచ్చి చెఱసాలం బెట్టితిని; నేఁడు నేరమును విచారింపఁబూనుకొనుటచే సాక్ష్యమిచ్చుటకు వీరిని హాజరుపెట్టితిని. ఇవియే నే నెఱింగిన సంగతులు.

కనక:—(కమలం దేటిపారఁజూచి, తనలో) ఔరా! ఏమిది? ఈమె యందు మా తల్లియొక్క ప్రతిబింబము పొడసూపుచున్నది? ఆఁ! ఏమి నా వెఱ్ఱి; ఒకరిని బోలినవారు వేరొక రుండరాదా? నాఁడు సముద్రములోఁబడిన నా జనని నేఁ డెక్కడనుండి వచ్చును?

సువ:—వీరసింగూ! ఈ హత్యాసందర్భమున నీ వెఱింగినవిషయము లను ప్రభువువారికిఁ దెలియఁజేయుము.

వీర:—ప్రభూ! నా కిరువురు భార్యలు గలరు; అందొకతె కుముదా బాయి; వేఱొకతె రాధాబాయి. ఇరువురకు బిడ్డలు గలరు. ఒకనాఁడు నే నరణ్యమునకు వేటకై యేఁగితిని. (కమలం జూపుచు) అట నొక బెబ్బులి యీామెపై లంఘించి, తన పొట్టం బెట్టుకొనుచుండఁగా నేను చటాలునఁ బోయి, దానిని మడియింపఁజేసి యీామెను రక్షించితిని. ఈమె తాను దిక్కు మాలినదానినని చెప్పుటచే నాఁడే నా వెంట నిడుకొని గృహంబునకుఁ దీసికొనివచ్చి మాతృభావముతో నే కొఱం తయుఁ గలుగకుండ గౌరవించుచుంటిని. ఈమెయు మహా సాధ్వీమతల్లివోలె వర్తించుచున్నది. కాని యీా నాఁడు మా పాపమో—లేక ఆమె కీ యపకీర్తి బ్రహ్మ లలాటమున లిఖించి నాఁడో, తెలియదు; కాని నా పెద్దభార్యయొక్క కుమారు నకు విషమిచ్చి చంపినది.

కనక:—వీరసింగూ! నీ వామె విషమిచ్చుట చూచితివా?

కమల:—(తనలో) అహహా! ఏమిది? ఈ కంఠస్వరము నాకుఁ జిరపరి చితమువలెనున్నదే? (పరికించి చూచి) అన్నన్నా! ఈతని మూర్తియందు నా కుమారుని చిహ్నములు పొడఁగట్టుచున్నవే!

వీర:—మహాప్రభూ! నే నసత్యమాడఁజాలను. ఈమె విషమిచ్చుటను నేను చూడలేదు. నా చిన్నభార్య యగు కుముదాబాయి నాతోఁ జెప్పినమాటనే నేను దేవరకు విన్నవించితిని.

కనక:—నీ యభిప్రాయమేమి? ఈమె యట్టి దుష్కార్య మాచరించిన దని తలంతువా?

వీర:—మహాత్మా! నే నది యెట్లుచెప్పఁగలను? ఆమె సద్వర్తనమును బట్టి చూడఁగా నట్టి హత్యం జేసియుండదని నేను మాత్రమే కాదు. ఇరుగుపొరుగువారు కూడ విశ్వసింతురు.

కనక:—మంత్రీ! ఇఁక వీని రెండవభార్య యగు కుముదాబాయిని విచారింపుము.

సువ:—వీరసింగూ! ఇఁక నీవు ప్రక్కకేఁగి, నీ రెండవ భార్య నిటఁ బ్రవేశపెట్టుము.

(అతఁ డట్లు చేయును)

కనక:—అమ్మా! నీ సవతి కుమారుని హత్యను గుఱించి నీకుఁ దెలిసిన యదార్థ మెఱిఁగింపుము.

కుము:—(గట్టిగా) నా సవతి కుమారుని ఈమె విషమిచ్చి చంపినది.

కనక:—(తనలో) ఏమి? ఇంత దృఢముగాఁ జెప్పుచున్నది. వాక్కునందలి కర్కశముం జూడఁగా, ఆ పని సపత్నీమాత్సర్యముచే, ఈమెయే చేసియుండునని తోఁచుచున్నది. (క్రమలం బరిశీలించి) అక్కటా! ఈమెం గాంచినంతనే హృదయమునందాందోళన మొదవుచున్నది. నిక్కముగ నా తల్లిపోలె నున్నది. (ప్రకాశముగా) అమ్మా! నీవు నీ సవతిబిడ్డ కీమె విషమిచ్చుచుండఁగా చూచితివా?

కుముద:—చూచి—లేదు—ఆఁ! చూచితిని.

కనక:—(తనలో) నీ వసత్యమాడఁజూచినను, నీ నాలుక అసత్య మాడదుగదా! (ప్రకాశముగా) అమ్మా! ఇఁకఁ జాలును నీ వేఁగుము. (మంత్రి నుద్దేశించి) సువర్ణా! నేరస్థురా లనబడు నామెను బిలువుము.

కమల:—(ముందునకువచ్చి నిలువఁబడును)

కనక:—అమ్మా! నీపై మోపఁబడిన యీ నేరమునకు నీవు ప్రత్యుత్తర మేమి చెప్పెదవు?

కమల:—(తనలో) "అమ్మా!" యనుటతోనే కనకసేనుఁ డనిపించి నాడీతఁడు. హృదయమా! తొందరపడకుము. (ప్రకాశముగా) అయ్యా! నే నేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు. మీ చిత్తము వచ్చినట్లు చేయుఁడు.

[ అపుడు వైద్యుఁ డొక బాలునితోఁ బ్రవేశము ]

వైద్యు:—మహాప్రభూ! ఈ హత్యాసందర్భమునందుఁ దగిన సాక్ష్య మిచ్చుటకు వచ్చితిని. నేనొక వైద్యుఁడను.

(అందఱుఁ దెల్లఁబోయి చూతురు)

కనక:—నీకుఁ దెలిసిన సత్య మెఱిఁగింపుము.

వైద్యు:—మహారాజా! ఈతఁడే విషమీయఁబడిన బాలుఁడు.

వీర:—హా కుమారా! తండ్రీ! బ్రతికితివా! (కౌఁగిలించుకొనును)

కనక:—(ఆశ్చర్యముతో) ఎట్లు బ్రతికినాఁడు?

వైద్యు:—ప్రభూ! వీసిని చికిత్సార్థమై నాయొద్దకుఁబంపఁగా నేను తగిన మందొసఁగి విషముం గ్రక్కించితిని. విచారణార్థమై, వీరెల్లరు నిటకుఁ గొనిరాఁబడుటచే, సత్యాసత్యము లీబాలుని వలననే తెలిసికొని, నిర్దోషిని రక్షించుటకై తరుణమున కిటు వచ్చితిని.

కనక:—ఎవరు నిర్దోషి?

వైద్యు:—ప్రభువు వారీ బాలునివలననే తెలిసికొనుఁడు.
కనక:—అబ్బాయీ! నీకు విషమిచ్చినది యెవరు?
బాలు:—మాపిన్ని. పాలలోఁగలిపి త్రాగుమన్నది. త్రాగుటతోడనే కన్నులు తిరిగినవి క్రిందఁబడితిని.
వీర:—హా! పాపాత్మురాలా! కుముదా! ఎంతదారుణ మొనరించితివే!
కనక:—సువర్ణా! శిశుహత్యంజేయుటకుఁ బూనుటయేకాక, తాఁజేసిన నేరము నన్యులపై నారోపించిన దగుటచే ఈమె వధ్యురాలు. అధికారపత్రమును వ్రాసి యిచ్చి దండనాధికారియొద్దకు భటునితో నీమెను వధ్యస్థానమునకుఁ బంపుము.
(సువర్ణుఁ డట్లు చేయఁగా భటుఁడు కుముదాబాయిని దోడ్కొనిపోవును. వీరసింగు కుమారు నెత్తుకొని పోవును)
కనక:—(తనలో) ఈమె తప్పక నాతల్లియే! సందేహము లేదు. తన కథం జెప్పుమని ప్రశ్నించెదనుగాక! (ప్రకాశముగా) అమ్మా! నీవృత్తాంత మెఱిఁగింపుము.
కమల:—అయ్యా! నన్నేల పలుమారులు నొక్కించి యడుగుదురు? నేనొక నిర్భాగ్యను. అనాధను. అని చెప్పినఁజాలదా!
కనక:—(ఆత్రముతో) అమ్మా! చెప్పుము. సందేహింపకుము; వెను దీయకుము. నీచరిత్ర సర్వము చెప్పుము.
కమల:—(తనలో) ఏమి? నాగాధను వినుట కింత కుతూహల పడుచున్నాఁడు. ఈతఁడు నేనుతలంచినట్లు నాబిడ్డఁడా? ఏమయినఁ జెప్పుటయే మంచిది. (ప్రకాశముగా)

సీ. మఱిది క్రూరుండయి । మగనిని వధియింప
నవదనై తినినేను । వినుతగుణుఁడ!
ఆత్మపాతివ్రత్య । మంత వొందింపఁగా
దుర్మార్గుఁడౌ వాఁడు । తొడరినంత

సహాయింపఁజాలక గహనసీమనుజొచ్చి
పలువిధకష్టముల్ బడితి నేను;
బిడ్డలనియుపుర విధివశంబునఁ గోలు
పోయితి నీరీతిఁ బుడమియందు

గీ. బ్రతికియున్నాను జీవచ్ఛ వంబనగుచు;
దిక్కు లేదెవ్వడనునాకు దీనురాల;
వంత మెండుగ నుండె నా స్వాంతమందు;
ఏల వినఁగోరెదవు నాదు జాలికతను?

కనక:—(చటాలున లేచిపోయి యామెం గౌఁగిలించుకొని) హా తల్లీ!

కమల:—(కౌఁగిలించుకొని) హా కనకసేనా! తండ్రీ! నీవేనా!

(తెర పడును)

---

## రెండవ రంగము



[ ప్రవేశము భటుఁడు ]

భటు:—కనకసేన మహారాజగారు ససైన్యయుతులై తన పినతండ్రి యగు క్రూరసేనునిమీఁదికి యుద్ధమునకు వెళ్లిరి. ఈ యుద్ధ మెన్ని దినములకు ముగియునో! తిరిగి మహారాజెప్పు డిటకు వచ్చునో! (ప్రక్కకుఁ జూచి) ఆ వచ్చువా రెవ్వరు చెపుమా? ఒక బాలికయు నొక పురుషుఁడును! (పరిక్రమించి) ఏమిది? ఏమిది? అహో! ఎన్ని దినములకు? మహారాజగారు విజయ పింహులే! నాఁడు జాడలేకుండఁబోయిన మా ప్రభువులే!

[అపుడు తారాసమేతుఁడై విజయసింహుఁడు ప్రవేశము]

భటు:—జయము జయము మహారాజుగారికి. (నమస్కరించును)

విజయ:—ఓరీ! విశేషములేమి?

భటు:—మహాప్రభూ! నాఁడు మీరు క్రూరసేనునిమీఁదికి దాడి వెడలుచు మార్గములోఁ దప్పిపోయినారు. చాలదినములవఱకు మీజాడఁ దెలిసికొనుటకు విశ్వప్రయత్నము గావించినను, లాభము లేకపోయినది. చివఱకు మహామంత్రిగారు పురోహితులవారి యాజ్ఞానుసారము సింహద్వారమును దుర్గతో నిర్మించిరి. అద్దానిం దెఱచి లోనఁ బ్రవేశించువారిని రాజుగాఁ జేయ నూహించిరి. కొన్నిదినంబులకు మీమిత్రులగు దివంగతులయిన ఉదయసేనభూపాలుని పుత్రులగు కనకసింహులిందుఁ బ్రవేశింపఁగలిగిరి. నాఁటినుండి వారే రాజయి పరిపాలనాదికము నిర్వహించుచున్నారు.

విజయ:—(ఆశ్చర్యానందములతో) ఏమీ? కనకసింహుఁడా! కుమారీ! తారా! రమ్మా. మీసోదరుఁ డిక్కడనే యున్నాఁడు.

భటు:—మహాప్రభూ! కనకసింహులవారు ప్రస్తుతము నగరున లేరు. నిన్ననే ససైన్యముగఁ గ్రూరసేనునిమీఁదికి దండెత్తిపోయిరి. దైవికముగా వారీమధ్యఁ దమతల్లిగారినిగూడఁ గలిసికొనినారు.

తార:—(సంతోషముతో) తల్లిగారా? తల్లిగారా?

భటు:—అవును. వారుకూడఁ గుమారునితో నేఁగినారు. ఎల్లప్పుడు నాసాధ్వి "తారా! తారా!" అని విలపించుచున్నారు.

తార:—తండ్రీ! నాకు జననిని, సోదరుని జూడవలెనని యున్నది.

విజయ:—(భటునితో) ఓరీ! నీవేఁగి రథ మాయత్తపఱుపుమని సారథితోఁ జెప్పుము. అమ్మా! తారా! మన మిప్పుడే యక్కడికేఁగుదము. క్రూరసేనుఁ డతి దుర్మార్గుఁడు; వానితోడి యుద్ధ

ములోఁ గనకునకుఁ దోడ్పడుటవసరము. రమ్ము. నగరులోనికిఁ బోయి తగుసన్నాహము లొనరించుకొందము.

(అందఱు నిష్క్రమింతురు)

( తెర పడును )

---

## మూఁడవ రంగము—యుద్ధభూమి



[ ప్రవేశము కనకసింహుఁడు, కమల, క్రూరసింహుఁడు ]

కనక:—ఓరోరి దురాత్మా! క్రూరసేనా! నేఁటితో నీ కాయుఃప్రమాణము పూర్తియయినది.

చ. జనకుని హత్యచేసితివి ✻ సాహసమంచుఁ దలంపకుండ నా
జననిని బొందఁగోరితివి ✻ చంపఁగఁ బంచితి మమ్ము బిడ్డలన్
మనఁగలవాఁడవేయిఁక న ✻ మానుషకృత్యములాచరింపుచున్
బనిచెదనిన్నుఁగాలుని పు ✻ రంబున కిప్పుడెదుర్మదాంధుఁడా!

క్రూర:—(అట్టహాసమొనరింపుచు) ఓరీ! నీచేత వధింపఁబడుటకు వీరపాల శూరపాలు రనుకొంటివా? లేక తక్కుంగల సైనికు లనుకొంటివా? పరాక్రమధనుండనగు క్రూరసేనుండను నేను. నాతోడి యుద్ధమునకు సన్నద్ధుఁడ వగుచున్నావా?

ఉ. దంచెదఁ బిండిపిండిగను ✻ దగ్ధముసేయుదు నీదుదేహమున్
పంచెదఁ గాకిమూఁకలకు ✻ పానముసేయుదు నీదురక్తమున్
వంచెద నీదువెన్నముక ✻ మాటలు వేయియువేల? వెంటనే
అంచితశౌర్యమేర్పడఁగ ✻ నాలమునందునఁదాఁకుమాననున్.

కనక:—ఓరీ! తుచ్ఛుఁడా! నీతోఁ బోరొనరించి నిన్ను యమపురి కనుపుటకే నేను సకలసేనాసమేతంబుగ నిటు వచ్చితిని. నీ యాశ్రితు లసువులం దొఱఁగిరి; నీ సైన్యము నశించినది. ఏకాకివై నీ వొక్కరుండవు మిగిలితివి. రమ్ము. వీరపాల శూర పాలుర సహాయార్థమై నిన్నుఁ గూడఁ బంచెదను.

(ఇరువురు యుద్ధము సేయుదురు)

కమల:—పరమేశ్వరా! తండ్రీ!

గీ. ధర్మము జయించుననుమాట సత్యమేని,
పతిని వ్రతముగఁదలఁచిన పడఁతి నేని,
కలుష మెఱుఁగక చరియించు కాంత నేని,
జయమొసంగుము; సుతునకు సంయుగమున.

( నే పథ్యమున— )

“ఉ. ఆలము సేయుచుంటి వవు
రా! కనకాహ్వయుతోడ; ఆతఁడా?
బాలుఁడు యుద్ధనైపుణిని
బాగుగఁ బొందఁడు; నీదు శౌర్యమున్
లీల హరింప వచ్చితిని
లెమ్ము; బలంబున నన్నుఁ దాఁకుమా!
కాలుని ప్రోలి కంపెదను
కౌతుక మొప్పఁగఁ గ్రూరసేనుఁడా!”

కమల:—ఆ మహానుభావుఁ డెవ్వఁడు?

[ విజయసింహుఁడు తారతోఁ గూడఁ బ్రవేశము ]

తార:—హా తల్లీ! ఎన్ని దినంబులకు నిన్నుఁ జూచితిని.

కమల:—హా తారా! సుఖముగనుంటివా? (కౌఁగిలించుకొనును)

విజయ:— అమ్మా! కమలా! సుఖముగనుంటివా?

కమల:— తండ్రీ! విజయసింహమహారాజా! నా యవజ్ఞను మన్నింపుము. పుత్రికావాత్సల్యమున నిన్ను మున్ముందుఁ బలుకరింపక పోయితిని.

విజయ:— మనము పిమ్మట సావకాశముగా మాటలాడుకొనవచ్చును. యుద్ధమునందుఁ గనకునకుఁ దోడ్పడు టవసరము. కనకసింహా! నీవు తప్పుకొనుము. నేనా క్రూరుని మచ్చమాపెదను.

కనక:— (క్రూరుని నిరాయుధునిగాఁ జేసి వానిమీఁదికి లంఘించి) తుచ్ఛుఁడా! ఇపు డెక్కడికేఁగెదవు? (అని కత్తిని గుండెలకు గుఱిసేయుచు) నీవు చిటికాలములో భూలోకమును వీడిపోవుదువు. అంత్యమునందయినఁ జేసిన దుండగములకుఁ బశ్చాత్తాపము పొందుము.

సీ. నిద్రితుండైయుండ ♪ నేతయా నాతండ్రిఁ
గదిసిచంపుటను నీ ♪ కిది ఫలంబు!
సాధ్వియా నాతల్లి ♪ సాహసంబునఁబొంద
నేచినందులకు నీ ♪ కిది ఫలంబు!
పసిబిడ్డలగుమమ్ము ♪ వధియింపఁ గానల
కేఁగఁజేయుటను నీ ♪ కిది ఫలంబు!
మంత్రిని సేనాని ♪ మరణమొందించి పొం
దిన సంతసమునకు ♪ నిది ఫలంబు!

గీ. ముదితలను గోరినందుల ♪ కిది ఫలంబు!
హేయముగ బ్రదుకుటను నీ ♪ కిది ఫలంబు!
హీనకార్యముల్ సేయుట ♪ కిది ఫలంబు!
తుదకు యమపురిఁజొచ్చుటే ♪ తుదిఫలంబు!!

(అని కత్తితోఁ బొడుచును. క్రూరసింహుఁడు హాహాకారము లొనరించుచుఁ గిలకిల తన్నుకొని చచ్చును. జయభేరులు మ్రోగు చుండఁగా తెర వ్రాలును)

## నాల్గవరంగము—సభాస్థలి



[ యథోచితముగఁ గనకసింహుఁడు, విజయసింహుఁడు, కమల, తార, తక్కుంగల అనుచరులు ప్రవేశము ]

**విజయ:**—నాయనా! కనకసింహా! క్రూరసేనుఁడు గతించినాఁడు. పైతృకమగు రాజ్యమున కభిషిక్తుఁడవైతివి. ఏతత్కార్యసందర్భమునఁ బౌరులను, పురోహితులను, మంత్రులను, సేనానులను, సామంతులను, వారి వారి అర్హతల ననుసరించి సత్కరించితివి. ఇఁకఁ గావలసిన దేమున్నది.

**కనక:**—మహాత్మా! మీ మిత్రవాత్సల్యమును నే నేమని కొనియాడఁగలను. మీకు మా తండ్రియందుఁ గల యభిమానముచే మమ్ములను సర్వవిధములను రక్షించితిరి. కష్టములు అలముకొనినపు డెంత త్వరితగతిం బూనినవో—నేడు మాయమగునపుడు కూడ నంత త్వరితగతినే పట్టినవి. సాధ్వీమతల్లియగు తల్లిని దర్శింపఁగంటిని. నాఁ డరణ్యములోఁ దప్పిపోయిన తారను జూడఁగల్గితిని. క్రూరుఁడగు క్రూరునకుఁ బ్రతీకార మొనరింపఁగల్గితిని. జనకుఁ డధిష్ఠించిన సింహాసనము నధిష్ఠించితిని. ఇది యంతయు మీ దయచేత నేకదా! ఇఁక నాకుఁ గావలసిన దేమున్నది? అయిన నిట్లగుఁగాక!

గీ. ఎన్నఁటికి నైన ధర్మంబె వృద్ధిపొంది,
ప్రజలు ధర్మాభిలాషులై పరఁగుఁగాక!
జార చోరులు నీతి వి దూరులెందు
నుర్వి నడుగంటి రూపుమా యుదురుగాక!

అందఱు:—తథాస్తు! తథాస్తు!! తథాస్తు!!!

( తెర వ్రాలును )

పంచమాంకము

సర్వము సంపూర్ణము.



# అనుబంధము

## మొదటిరంగము — కనకసేనుని సభాస్థలి

[ తెర యెత్తఁగాఁ గమల, తార, కనకసేనుఁడు, విజయసింహుఁడు ప్రవేశము ]

కమ:— తండ్రీ! విజయసింహమహారాజా! మీ కరుణాకటాక్ష వీక్షణంబున మా కష్టములు గట్టెక్కినవి.

సీ. క్రూరుండు, చోరుండు జారుండునౌ వాఁడు
పాపఫలంబును బడసినాఁడు;
కనకసేనుఁడు తండ్రిగారి సింహాసనం
బున వెల్గుచున్నాఁడు మోదమొప్పు;
ననుఁగాన కొంటెఁగా నలఁ గష్టమందిన
తార యీ నాఁడు నా దండనుండె;
పైతృకరాజ్య సత్పాలనాగౌరవం
బొనగూర్చుటను సుతుం డుత్తముండు!

గీ. రాజశేఖర! నేఁడు మా కోర్కెఁ గలిగె
దీనరక్షకుఁడైన యా దేవదేవుఁ

---

* "కనకతార" నాటకములోఁ బ్రధానులు తారా కనకసేనులగుటచేత, ఈ నాటకము సుఖాంతమగుటచేతను, మే మిం దనుబంధముగా నా యిరువురి వివాహ కథాభాగమును బొందుపఱచితిమి. ప్రదర్శకులు తమ వీలు ననుసరించి యిష్టానుసారముగా నీ భాగము నుపయోగించుకొనవచ్చును.

డెదఁ బ్రవేశించి మీచేత నెల్లకార్య
ములను జేయించినాఁడు కష్టములఁదోలి!

విజయ:—అమ్మా! నీవు నన్నింతఁగాఁ బొగడనేల? ఇంతకు నే నొన
రించిన ఘనకార్య మేమున్నది? సర్వము భగవదిచ్ఛ! కష్ట
ములు మూడుటకుఁ గాని, సుఖములు చేకూరుటకుఁగాని మన
యిష్ట మేమియు లేదు. ఒకప్పుడు లోకబాంధవుండు, సర్వ
భూత సన్మిత్రుఁడు నగు సూర్యుఁడు సర్వజనులచేత గర్హింపఁ
బడును. అందులకుఁ గారణము—కాలచక్రపర్యటనముగదా!
తల్లీ! అదేవిధముగఁ గాల మెంతలేసి మాన్యుల నయినఁ గొని
తెచ్చును. నేఁడు హంసతూలికాతల్పమున శయనించు భోగిని
రేపు కటిక గానేల నుండఁజేయును. నేఁడు తిరిపె మెత్తుకొని
జీవించు నిర్భాగ్యుని రేపు దూరీకృత పురందర మహావైభవో
పేతుం గావించి, వానిచేఁ జతుస్సముద్రముద్రితం బగు ధరణీ
మండలంబును శాసింపఁజేయును. కాలవిభ్రమణముచేత నే, ఎండ
కన్నెఱుంగక, శుద్ధాంతఃపురంబులలోఁ జెలికత్తెలనడుమ సంచ
రించిన మహారాణివగు నీవు—కానఁబడి యిడుములు గుడిచి
తివి. ఇపుడా దుష్కాలము గతించినది. మబ్బువిడిన చంద
మున నీ కష్టము లన్నియుఁ గడతేరినవి. భగవంతుని యక్షీణ
కృపాకటాక్ష వీక్షణ పరంపరలచే నీ సుతుండు రాజ్యాభిషిక్తుఁ
డాయెను. వానికి వివాహం బొనరించి, ఏతన్మహోత్సవంబును
గన్నులారఁ గాంచుటకన్న నీకుఁ గావలసిన దేమున్నది?

కమల:—రాజేంద్రా! ఇన్ని చేసినవాఁడ వా కార్యము మాత్రము
చేయక, మిన్నకుందువా?

తార:—అమ్మా! నాయనగారు సజీవులై యున్నపుడు, అనేకపర్యా
యములు—“విజయసింహమహారాజా! మాకు మీతో వియ

మందవలయు నను నభిలాష గలద" ని పలుకుచుండఁగా, నేను వినియుంటిని.

కమల:—అవును--వాస్తవమే! అనన్య సౌందర్య తేజో లావణ్యరాశి యు, నిరుపమ విద్యావతియు, సద్గుణఖనియు, విశేషించి యుక్తవయస్కయు నగు బాలికారత్న మొండు విజయసింహ మహారాజున కున్నది. ఆమెనే కనకసేనున కిచ్చి పెండ్లిసేయు టకు నా రూహించెడివారు.

విజయ:—అమ్మా! నా పుత్త్రికను కోడలుగాఁ బరిగ్రహించుటకు నీకును, భార్యగాఁ జేకొనుటకు నీ సుతునకును, అంగీకార మయిన నిఁక నాకుఁ గావలసిన దేమున్నది? నా కెవ్విధ మయిన యభ్యంతర ముండదు; సరికదా, నిర్భరానందము డెందమున సందడిల్లును.

కమల:—అయిన నిఁక నేమి? వెతుకఁబోయిన తీవ కాలికిఁ దగిలినట్లు, మీ యభిప్రాయ మెఱుంగవలె ననుకొనుచుండ మీ యంత మీరే మాకుఁ దోడ్పాటు నొసంగుచున్నారు......కనకా! ఇందులకు నీ వేమందువు?

కనక:—అమ్మా! అనుట కేమున్నది? స్వర్గస్థులగు తండ్రిగారికి విజయ సింహమహారాజు వామభుజప్రాయుఁడు. వా రిరువురి స్నేహ మును ముచ్చటించుట కాదిశేషుఁడు గూడ సమర్థుఁడు కాఁడు. సార్థకనాముఁడగు క్రూరసేనుని దుండగముల వలన వారు మన లను విడిచినది మొదలు, విజయసింహమహారాజే మనపాలిటి భగవంతుఁడై, వారు లేని కొఱంత యావంతయు లేకుండ, సర్వకార్యంబులు సఫలీకృతంబు లగునట్లు నిర్వహించు చున్నాఁడు. అట్టియెడ నమ్మహాత్ముఁ డవ్యాజానురాగముతోఁ

దనకుఁ దాన తన సుతను నా కిచ్చి పరిణయం బొనరింపఁ గోరుచో, నే నేమందును? సిరిరా మోకాలొడ్డుదునా?

కమల:—విజయసింహమహారాజా! వింటివా కుమారుని మాటలు!

విజయ:—అమ్మా! నేను ధన్యుండ నయితిని. మన రెండుకుటుంబములకు ననాదినుండియుఁ గల స్నేహభావము, నా ప్రాణమిత్రుండగు నుదయసేనమహారాజుయొక్క బలవన్మరణముతో నంతరించునని సంకోచించి యంతరంగమున వంతం జెందితిని. కాని దైవకృప వలన నయ్యది వియ్యముగాఁ గూడ మారినది.

కమల:—అట్లయిన, నాయనా! కనకసేనా! ఈ శుభకార్యమున కాలస్యమేల? "అలస్యా దమృతం విషమ్మ" ను సామెత గలదు. "శుభస్య శీఘ్రమ్మ" ను సూక్తి ననుసరించి, వివాహయత్నము లొనరించుట నా యభిమతము.

కనక:—అమ్మా! నీ యాజ్ఞను దలం దాల్చెదను. (విజయసింహు నుద్దేశించి) రాజేంద్రా! భవదీయ పుత్త్రికారత్నము నొసంగి నాపై నీకుఁ గల యపారమగు ప్రేమను వెల్లడించుచున్నావు. నా కది సంతోషమే! కాని, పూతాత్ముండ వగు నీ వొనరింపవలసిన దింకొక్కటి యున్నది.

విజయ:—అది యేమి? తెలియఁజేసిన నా శక్తికొలంది పాటుపడి దానిని గూడ నిర్వహించెదను.

కనక:—ఆర్యా! మీకుఁ దెలియని దేమున్నది? మా తారకుఁ గూడ సర్వవిధముల ననుకూలుఁడగు పురుషుని వెదకి పరిణయం బొనరింపవలయును.

కమల:—నేను చెప్పఁదలంచుకొన్నమాటను నా కుమారుఁడే చెప్పినాఁడు. మహారాజా! మా కుటుంబ సముద్ధరణమునకు బద్ధకంకణుండ వయిన నీవే యీ కార్యమును గూడ నెఱవేర్పవల

యును. జరాభారము విశేషముగాఁ బైఁబడుచున్నను, తీఱని వెతలు హృదయము నింతదనుకఁ గలంచివైచుటచేత, శుష్కీభూతశరీర నయితినిగదా! వాన రాకయు, ప్రాణము పోకయు నెవ్వరు చెప్పఁగలరు? పరమేశ్వరుఁ డెప్పుడు దీను రాలనగు నన్నుఁ దన సాన్నిధ్యమునకుఁ బిలువనంపునో! "జాతస్య మరణంధ్రువమ్మ" నుటచేఁ జా వెప్పటికయిన నున్నదే కదా! కనుక నాకీ మేనఁ బ్రాణము లుండఁగనే కుమారుని పెండ్లితోఁబాటు కొమరితయొక్క వివాహమును గూడఁ దిల కించితి నేని, ధన్యనయ్యెదను. నిశ్చింతతో జీవితశేషముం గడిపెదను.

విజయ:—అమ్మా! నీ మనోగతాభిప్రాయ మెఱింగితిని. తదనుసార ము తొరకుఁ దగిన ధవుని వెదకెదను. ప్రస్తుతము మనము లోనికిఁ బోవుదము రండు.

కమల:—మంచిది.

(అందఱు నిష్క్రమింతురు)

(తెర వ్రాలును)

---

రెండవరంగము:—కనకసేనుని నగరు



[ప్రవేశము—గిడ్డూఖాన్, మందపాలుఁడు]

మంద:—ఏమోయ్! సాహేబూ! ఏమిటి విశేషములు?

గిడ్డూ:—(కోపముతో) క్యారే? క్యాబోల్తారే? సాహేబూ హం టావ్? మాకీ ముసల్మాన్‌కీ, గిడ్డూఖాన్ బహదూర్‌కీ, నబాబ్ హని పిల్వటం మాని—సాహేబు సాహేబు హంటావ్?

మంద:—(నవ్వుకొనుచుఁ దనలో) ఈ దిక్కుమాలినముండకొడుకున కూరంత స్వాతిశయమున్నది. వీని "సాహెబూ" యని పిలువరాదఁట! "నబాబుగారూ!" అనవలెనఁట! (ప్రకాశముగా) ఓయి సాహెబు......కాదు—కాదు—నబాబూ!

గిడ్డూ:—అచ్చా-అచ్చా-మాకీ నీకీ హాలాగ పిల్వానాలా సరే—హిప్డూ సంగతి యేంటో హడ్గు సెప్తాం.

మంద:—కోటలో సందడియెక్కువగానున్నది పురమంతయుఁ జక్కఁగా నలంకరింపఁబడియున్నది. ఏ వీధిలోఁ జూచినను విశాలములగు పందిళ్లు వేసిరి. రంభాస్తంభములనునిల్పి, తోరణములతో వానిం గై సేసిరి. ప్రతి గుమ్మము పసుపుకుంకుమములతోఁ గలకలలాడుచున్నది. ఈ సంతోషమునకుఁ గారణమేమి?

గిడ్డూ:—హారే హల్లా! మంధాపాలా! నీకీ సచ్చిన తల్లీ తండ్రీ హెయిర్వా సంవత్సరాల్ తల్లకిందుల్‌గా తపం జపం గిపం సేసి, నీకి బుద్ధికీ తగినట్టుగా "మంద" నాసుం పెట్టేర్—హేంటీబే? హాకాశంనుంఛీ దిగీపడ్డావోడిలాగ, హూళ్ళోని సంగాతుల్ హెర్గానివోడిలాగ హల్లాగా హడ్గుతావ్? హీ మధ్యా యెడ్డా సచ్చావ్?

మంద:—(తనలో) ఈ తురకముండకొడుకు నోటికి వచ్చిన మచ్చునఁ బ్రేలుచుండును. నేను తిరిగి యేమయిన నన్నచో, వీని కూరంత కోపము వచ్చును. (ప్రకా) ఓయీ! సాహెబూ! కాదు—కాదు—నబాబూ! ఈ మధ్య నేనీ నగరములో లేను. అందుచేతనే యీ సందడికిఁ గారణమేమని ప్రశ్నించుచున్నాను.

గిడ్డూ:—హారే! హెక్కడికీ పోయావ్! యమలోకం నీకీ సచ్చిన తల్లికి తండికి సూస్కొ హుండడాన్కి పోయివుండావ్?

మంద:—పడ్చినావులే. యమలోకములో నీ కుద్యోగము సంపాదించుట కేఁగితిని.

గిడ్డూ:—(సంతోషముతో నెగిరి గంతులిడుచు) అచ్ఛా-అచ్ఛా-అరే భాయీ! మాకీ యమలోకంలో బడాబడా హుద్యోగం దొర్కుతాదిబే?

మంద:—ఓ; తప్పకుండ దొరకఁగలదు. ముందు నా ప్రశ్నమునకు సమాధానము చెప్పుము.

గిడ్డూ:—హాయితేహిన్కో- మందపాల్! మన కనక్-సేనమహారాజ్ గార్కి- వారి తండ్రీ హుదయసేనమహారాజుగారి స్నేహితుఁడు హుండాడ్?......

మంద:—అవు నవును. విజయసింహమహారాజు.

గిడ్డూ:—అచ్ఛా-ఆ మహారాజ్కీ- హమ్మాయినీ యిచ్చి పెండిల్ వారి కోటలో సేస్తార్. హందుకు హీ నగరంలోని పెద్దా పెద్దా హుద్యోగస్తుల్—సేనాధిపతుల్—మంత్రుల్—వర్తకుల్—హందఱు పయనమై పోతావుండార్!

మంద:—ఆహా! ఎంత సంతోషకరమైనవార్త! సాహెబూ! మన కనకసేనమహారాజుగారికి వివాహమని చెప్పి, నాకు సంతోషము ఘటిల్ల జేసితివి.

గిడ్డూ:—నారే మందాపాల్! సమ్చామందాపాల్! హిన్కో-! హొకటీకాదు. రెండూ పెండ్లిండ్లు.

మంద:—ఎవరెవరికి?

గిడ్డూ:—నీది వట్టి మట్టీబుర్రాబే. హెంతాసెప్పిన తెల్దు. మన మహారాజ్ గార్కి- హప్పహుండారు—తారహమ్మ—హామెకు రెండోపెండ్లి.

మంద:—ఓరి నీ తెలుఁగుమండ! ఈ మాట నన్నుఁ లెవ్వరయిన విన్న చో నీ తలఁ ద్రెళ్ల నేసియుందురు. కనకసేనమహారాజుగారి వివాహముతోఁ గూడఁ దారకుఁ గూడఁ బెండ్లియా? ఆహా!

నేఁ డెంతసుదినము! శుభములు కూడఁ గష్టములవలె నొంట రిగ రావుగదా! గిడ్డూఖాన్ అనన్య సౌందర్య లావణ్యతేజో రాశి యగు తారను బరిగ్రహించు క్షత్రియకుమారుఁ డెవ్వఁ డో నీ వెఱుంగుదువా?

గిడ్డూ:— హెర్గాకేమి? తెలుస్-మాకీ హంతా తెలుస్--తారాకి కాఁ బోయే పెనిమిటి కల్యాణనగరం పాలించు కీర్తిమంతమహారాజ్- బడాహందాగాడ్. హా మహారాజుని సూడాలిహంటే దేముడు ఇచ్చిన రెండుకళ్ళూ చాలవు.

మంద:— గిడ్డూఖానూ! వివాహముహూర్తమెప్పుడు?

గిడ్డూ:— హారే-హెళ్లుండిబే- హేనుగ్గు-గీనుగ్లు-గుఱ్ఱాలు-రథాలు-- హాన్నీ హుడాయించేయి...కనకసేనమహారాజులుంగారు తమ హాప్పా. తల్లీతో కూడా మంత్రుల్ గింత్రుల్‌తోఁ కూడా విజయసేనమహారాజులుంగారి పట్టణానిక్- హెళ్లిపోయేర్.

మంద:— గిడ్డూఖాన్! తారా కీర్తిమంతుల వివాహము కూడ నా పందిట్లోనే జరుగునా?

గిడ్డూ:— అచ్ఛా— ఆగును. ఇంకా గాతాఖానీ కట్టిపెట్టు మేం పార హుషార్ హండం మాని కూకొని, కబుర్లు సిత్తగిస్తే, హెవ రయినా సూచీ మాకీమీద దెబ్బతీస్తార్!

మంద:— మంచిది. నాకు సెలవిమ్ము. నేను గూడ మహారాజుగారి కల్యాణమహోత్సవము చూడఁబోయెదను.

గిడ్డూ:— హెళ్లూ-హెళ్లూ-వచ్చేటప్పుడు మాకి సజారా గిజారా జాస్తిగా తీసుకొని నచ్చి యియ్యి.

(మందపాలుఁడు నిష్క్రమించును)

(తెర వ్రాలును)

---

## మూఁడవ రంగము—కల్యాణమండపము



[తెర యెత్తగా యథోచిత వేషములతో సుశీలా కనకసేనులు, తారాకీర్తిమాతులు, కమల-విజయసింహులును మున్నగు వారు ప్రవేశము]

విజయ:—(సుశీలయొక్క హస్తమును బట్టుకొని) కుమారీ!

చ. పెరిగితి వింతకాలమును | ప్రేముదలిర్పఁగ నా గృహంబునం
దరుగుచునుంటి వీ విపుడు | నా కనకాహ్వయుపత్ని వౌచు; నే
మరకుము మమ్ము నెల్లరను | మాననమందున; భక్తితోడుతన్
చరణములంటి మ్రొక్కి పతి | సంతసమొప్పఁగ సేవజేయవే!

సీ. గతజీవుఁడైనట్టి | కాంతుని బ్రదికించి
పేరుగొన్నట్టి సా | విత్రిపోల్కి
కమలాసనాదులఁ | గసుగందులను జేసి
స్తుతులుగాంచిన యన | సూయమాడ్కి
పతినీడఁబాయక | వనముల నిక్కట్లు
పొందిన భూపుత్రి | చందమరసి
అతుల పాతివ్రత్య | మాత్మధనంబుగా
నలరిన దమయంతి | ననుసరించి

గీ. భర్తృసేవకు మించిన | భాగ్యమొండు
త్రిభువనంబుల లేదని | తెలిసి సతము
భర్తసేవించి సత్కీర్తిఁ | బడయుమమ్మ!
సార్థకాహ్వయ వౌదువు | జగతిలోన.

పుత్రీ! అధిక విద్యావతివి, వినయవతివి నగు నీకు మేము వేఱుగా సత్ప్రవర్తన మెలవడఁజేసికొమ్మని చెప్పనక్కఱలేదు—స్త్రీలకు పాతివ్రత్యమే భూషణము. పాతివ్రత్యమును మించి

నది వేఱొండులేదు. అర్థాని నలవడఁజేసికొన్న యింతు లెంత లెంతలేని కార్యముల నయిన సాధింతురు. హైందవ సుందరీ మణుల సుపవిత్ర చారిత్రంబుల నీవు పఠించితివి. వారిని హృత్సీమను నిలిపి, అత్తింట వన్నెకెక్కుము. నీ భర్తయగు నీ కనకసేనుఁ డవక్రపరాక్రమశాలి; రూపజితమారుఁడు—మహేంద్రవైభవోపేతుఁడు—గుణరత్నాకరుండు—ఇట్టివానిని భర్తగాఁ బడయుట కీవు పూర్వజన్మంబునఁ బుణ్యం బొనరించితి వని యేను వేఱుగఁ జెప్ప నేల? సుశీలా! పుట్టినింటికిని, మెట్టినింటికిని సత్కీర్తి నార్జింపుము.........(కమల నుద్దేశించి) అమ్మా! కమలా! నీవు సద్గుణములచేతను, సత్ప్రవర్తనము చేతను, శాంతముచేతను భూజాతయగు సీతవంటిదానవు. ఆ నాఁ డామె దుష్టుండగు రావణునిచేఁ జెఱఁబెట్టఁబడి నాథుని బాసి, యిక్కట్టులందినది. ఈనాఁడు నీవు కథావశేషుఁడయిన క్రూరునివలన బాధ లనుభవించితివి. ఆమె దశకంఠుని బెదరింపులకు లొంగలేదు. నీవు మఱఁదియొక్క ధార్ష్ట్యమునకుఁ గలంగలేదు. పాతివ్రత్య పరిపోషణమే ప్రాణాధికమని భావించితివి. నీ కీ నా పుత్రి తన పూర్వజన్మ సుకృతంబుచే గోడలయినది. నీ శాంతమే యామెలో వెలుఁగొందునట్లును, నీ సత్ప్రవర్తనమే యామె కలవడునట్లును జేయు భారము నీయది.

కమల:—ఆర్యా! విజయసింహ మహారాజా! నీ విన్నవిధముల నాకుఁ జెప్పనక్కఱలేదు. సూర్యునకుఁ గాంతి నినుమడింపఁజేయు పదార్థ మింకొకటిలేదు. సహజసద్గుణవతి యగు నీ కొమరితకు నేను వేఱుగా సత్ప్రవర్తనము బోధింపనక్కఱలేదు.

విజయ:—నాయనా! కనకసింహా! నాకు మగసంతు లేదుగదా! కొమరుండ వయిన నల్లుండవయిన నీవొక్కరుండవే! నా యేకపుత్రి

కను నీ చరణదాసిగ నర్పించుచున్నాను. ఆమె గోల! తెలిసియో, తెలియకో యొనరించు దోసఁగుల రక్షించుభారము నీయది. నేను నిన్నామెను సాదరణమునఁ జూడుమని హెచ్చరించు టనుచితము.

కనక:—మహారాజా! కొమరుండనయిన నల్లుండనయిన నేనొక్కరుండ నేకదా మీకు! నాకుఁ దండ్రియయిన మామయయిన మీరొక్కరే! మీ పుత్రికను మీరు నన్నెట్టి ప్రేమభావముతో సాకుచుంటిరో, అట్టి భావముతోడ నే సాకుచుందును...... ఇఁకఁ గాలయాపన మెందులకు? కాఁగల శుభకార్యము లయినవి. అపారమగు మీ కృపారసంబున మా తారకుఁ గూడఁ గీర్తిసింహ మహారాజు నిచ్చి పరిణయము గావించితిరి. నన్నొకయింటివాని నుంచితిరి. ఆజన్మాంతము నేను మీకుఁ గృతజ్ఞుండను... కాలయాపన మెందులకు? మా నగరమునఁ బ్రజలందఱు మా రాకకొఱ కెదురుచూచుచుందురు. కనుక ప్రయాణసన్నాహము లొనరించుకొనవలయును.

విజయ:—అయినరండు. మన మా కార్యములను నెఱవేర్చుకొందము.

(అందఱు నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

---

నాల్గవ రంగము—కనకసేనుని నగరు



[ ప్రవేశము గిడ్డూఖాన్ ]

గిడ్డూ:—(తనలో) అచ్ఛా హీంయాళా బహూసంతోషం. విజయసేన్ మహారాజ్ గారి [illegible] ముకీ పెండ్లిహోడి కనకసేన్

మహారాజ్ గారు వస్తూవుండార్. ప్రజలుహాందర్ పండ్గాబట్టల్ కట్టి మంగళ్ హాయిద్దాల్ హెంటా బెట్టుకోని, హేనుగుల్ గుఱ్ఱాల్ కూడా తీసికోని హెదురు హేగినార్ ...... (ప్రక్కకుఁ దిరిగి) అదిగో! మందాపాలుఁడు ప్రవేశించుచున్నాడు. హాడ్కి-హాడ్గితే మంగతుల్ బోధపడ్తాయ్.

[అంత మందపాలుఁడు ప్రవేశము]

మంద:—క్యా రేలడ్డూఖాన్.

గిడ్డూ:—(నవ్వుచు) వహ్వా-వహ్వా-లాడూ గీడూ జాస్తీగా హాడ్డా తినీవుంటావ్. హాందుచేత గిడ్డూఖాన్ హాండాన్కి బదులుగా లడ్డూఖాన్ హంటున్నావ్. విశేషము లేవిఁటి?

మంద:—విశేషముల కేమున్నవి? మన మహారాజుగారు నూతన వధువును వెంటనిడుకొని రెండవ యింద్రునివలె నగరప్రవేశ మొనరించుచున్నారు. కీర్తిమంతునితోఁ దార వాని పురంబున కేఁగినది. నూతన వధూవరులు నగరులోఁ బ్రవేశించుసరికి మంగళవాద్యములు మిన్నుముట్టునట్లు మ్రోగవలయు ననియుఁ బువ్వగుచ్ఛములను సువర్ణాక్షతలను పురంధ్రీమణులు సౌధవీథుల నిలిచి వారిపైఁ జల్లవలెననియు మంత్రులాజ్ఞాపించిరి. మఱియుఁ బేదల కన్నవస్త్రములను, ఉద్యోగస్థులకు హెచ్చు వేతనములను, పురోహితుల కగ్రహారములను, భూసురులకు భూరిసంభావనలను, సామంతులకుఁ గానుకలను, దక్కంగలవారికిఁ దగినరీతుల బహూకరణములను అర్పింపవలయునని రాజాజ్ఞ.

గిడ్డూ:—అచ్ఛా-అచ్ఛా. హెం[illegible]ంతోషం. హాయితే, భాయీ, నీకీ మాకీ హేమయిన, [illegible]ర్కి పెండిల్ గిండిల్ హాయి నంద్కు లాభంగీభం [illegible]టా? హుండాదా?

మంద:—ఓరి మూర్ఖుఁడా! లేకేమి? హెచ్చువేతనములని నేను మీకుఁ జెప్పలేదా?

గిడ్డూ:—హాయితే మేం ఫారావాళ్లంగదా! మాకీ హుద్యోగస్తుల్ లెక్కాలోకి వస్తామా?

మంద:—రాకేమిరా? నీవు కూడ నుద్యోగస్థుఁడవే! ఈ సోదికేమి? రా—నగరులో నప్పుడే మంగళవాద్యములు మ్రోగుచున్నవి. మనము కూడఁ గన్నులార నా మహోత్సవము చూతము.

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెర వ్రాలును)

---

## అయిదవ రంగము—దర్బారు



[ సింహాసనాసీనుఁడై కనకసేనుఁడు—మంత్రులు—సేనానులు—పురోహితులు—పౌరులు మున్నగువారు యథోచితాసనములపైఁ బ్రవేశము ]

కనక:—సకల పురోహితామాత్యచమూపతులారా! పౌరులారా! నేఁ డెంతయు సుదినము. వెనుక మా తండ్రిగారు మీ యందఱి సమక్షమున సుఖాసీనులై యీ విధముగాఁ బ్రజానురంజకముగాఁ బరిపాలనము గావించిరి. అట్టి పుణ్యదినము నేఁడు మరల సంప్రాప్తమయినది.

మంత్రి:—పౌరులారా! సామం[redacted]గా! కనకసేనమహారాజప్రక విక్రమబలాఢ్యుఁడు. కా[redacted]డు. ప్రజ్ఞాధురంధరుఁడు. ఉదయసేనమహారాజును ధన[redacted]ణసంపత్తిచే మరపింపఁగల

ధీశాలి! ఈ మహాత్ముని యేలుబడిలో మీ రందఱు నే కొఱం
తయు లేకుండఁ బ్రతుకుఁడు.

కనక:—మంత్రిసత్తమా!

సీ. పినతండ్రి ప్రజలను ౹ బీడించిలాగిన
ధనము, వారలకిచ్చి ౹ తనియఁజేసి;
జీర్ణదేవళముల ౹ జెన్నొందఁ బునరుద్ధ
రణము గావించి యు ౹ ర్ధమ్ముఁ బెట్టి
పేదసాదలు లేక ౹ వీడు వెల్గొందంగ
వారి కుపాధు లే ౹ మరక యిచ్చి;
ప్రజలు సంతోషమన్ ౹ వార్ధిఁదేలెడురీతి
పరిపాలనావిధం ౹ బరయఁజేసి

గీ. ధర్మపరిరక్షణంబును ౹ దనరఁజేసి
కనకసేనుని పాలన ౹ కౌతుకంబు
కలుగఁజేసినదని యెల్ల ౹ జనులు మెచ్చ
జక్కఁజేయంగవలయును ౹ సత్వరమున.

పౌరులు:—జెయ్. శ్రీ కనకసేనమహారాజుగారికి జెయ్.

మంత్రి:—మహారాజా! మీ యాజ్ఞను నిర్వహింతుము.

కనక:—సచివులారా! వెనుక మా పినతండ్రిచేత పీడింపఁబడిన వైశ్యుని
బిలిపింపుఁడు. వాని ధనమును వాని కర్పింపుఁడు. వానిచేఁ
దగులఁబెట్టఁబడిన గ్రామములను దిరిగి నిర్మింపుఁడు. మఱియుఁ
బ్రజాసౌకర్యము లనఁదగిన నూతులు—చెఱువులు—సత్రములు—
విశాలములగు బాటలు నిర్మింపుఁడు. మన యేలుఁబడిలోఁ
బ్రజలు తండ్రిగారిని [illegible] చోర క్షామ బాధలు లేక—
నిత్య సత్యవ్రతులై, [illegible]రాయణులై, భక్తియుక్తులై
సుఖింపవలయును.

పౌరులు:—మేలు. మహారాజా! మేలు! నీ గుణగణంబులను గీర్తించుట కాదిశేషుఁడు గూడ సమర్థుఁడుగాఁడు.

కనక:—మంత్రులారా! నేఁటి దర్బారునకు హాజరయిన ప్రజల నెల్లర నుచితరీతిని సత్కరించి పంపుఁడు. ఇఁక సభఁ జాలించి మీరా ప్రయత్నంబులం గుండుట నా యభిమతము.

మంత్రి:—పౌరులారా! మహారాజుగారును, పట్టమహిషియుఁ బ్రాసాదోపరిభాగమునుండి కనుఁగొనుచుండఁగాఁ గోశాధిపతులు మీకు బహుమతుల నొసంగుదురు. అందులకై యిప్పుడు దర్బారు ముగియవలసినదని మహారాజుగారి యాజ్ఞ!

(తెర వ్రాలును)

---



# కనకతార సాంగ్స



1. ఉదయసేనుఁడు:—

ఏగతి దుఃఖము నిపుడు వీడుదునో॥ ఏ॥
పుట్టినాఁడుదుష్టాత్ముఁడు, నాసో। దరుఁడు నాకర్మకతమునన్॥ఏ॥
(చరణము) సతతము పరవనితలఁ గొని,
దుష్టుల చెలిమిని మెలఁగుచునుండున్॥ ఏ॥
పాపమనక కడుమోదమున మధువుఁగొని
అతిబీదలఁగని త్రేల్చున్। దొం। గతనములకుఁ దలకొని,
హత్యలుసలుపుచు, భయముఁగొలుపుచుండున్।
ఎపుడిఁక సౌజన్యము దగఁ గల్గున్।
ముదమందన్। సుఖియింపన్॥ ఏగతి॥

2. మంత్రి:—

భూమిపాలా! వగపూ। స్వాంతమున వీడుమా।
ఎంతబోధ సుధను నీవి। చ్చిన నేమీ॥ భూమి॥
(అనుపల్లవి) శీలముఁగఁఆపిన, ధర్మము లెన్ని చెప్పినను, లాభము।
సుంతయేని గలుగదుగ, నీ। సోదరుండు మానఁడూ॥ భూమి॥
(చరణము) కానలఁగాచు వెన్నెలట్టులా।
పాములకును పాలొసఁగురీతినీ। గ్రుడ్డికి నద్దము చూపినగతి।
వ్యర్థంబు నీవాక్యములు, వానికై।
యేటికి మానసమందు చింతిలెదు, నీతమ్ముఁడు క్రూరుడుగా।
ఏనాటికిన్। మాటలా। లించునా॥ భూమి॥

3. క్రూరసేనుఁడు:—

కలిగెగా। మరాడెనుగా। యింకమృత్యువు నీ।
యసువుల బలిమిని గొనుగద॥ కలిగెగా॥

(అనుపల్లవి) ననునిటు భయము రవంతయుగొన కీ।
గతి చులకదనంబున్ గనుదువా।
(చరణము) తెలియునిక వడిగ మదీయ।
గుణగణంబు, బలము, చలము, కననగుగా।
పలికెదుగా। చులకనగా। జడిసెదుగా॥ కలిగెగా॥

4. ధీమంతుడు:—

రాజా! యికతాళఁదగదు। వేగిరింపుమ॥ రాజా॥
(అనుపల్లవి) యోచింపకేదియో యొక శి।
క్షనొసంగదగు, వినుమిపుడు। సోదరుండనఁదగదు। రాజా॥
(చరణము) చోరుడొచు దురంతమే చేసెగా।
ప్రజాసముదయంబు మొఱవినునుమా। సోదరుండీరీతినుండ,
కీర్తియేనశియించును, అల్లరి హెచ్చున్
వైశ్యునిదైన్యము తొలంగఁజేసి। ధర్మరక్షణ సలుపఁబూని।
సౌఖ్యకరము, శాంతియుక్తము। గాగ నేలు భూమిని
రాజా! యికఁ దాళరాదు॥ రాజా॥

5. సేనాధిపతి:—

శాంతమువీడుమ। క్రూరుని నిప్పుడె।
ఖైదుఁ జేయఁదగు వీకన్॥ శాంతము॥
ఖలుపితమతియాట వాని దయఁ గనఁ।
దగదువినుమ, భీతివీడి వేగ। శాంతము॥
(చరణము) బలము, చలము గనఁ।
బడ జనములు మెచ్చ। పదములు,
కరములు కట్టిద క్రూ। రుని దెలనిడెదను,
ఆజ్ఞనొసంగుమ। ప్రవిమలచరితా, వినుతగుణా॥ శాంతము॥

6. కమల:—

జాలమేలచేసెన్ విభుఁడు॥ జాల॥
క్రూరసేను దుష్టత్వంబున్। స్వాంతమునఁ దలఁచి
విచారమొందెనో। మానసంబు వ్యాకులపడెనో।
ఎంతసేపు తడయన్॥ జాలమేల॥

7. కమల:—

దుఃఖము పొందఁగా॥ దుఃఖము॥
విభుఁడ! కారణమేమినుడువు మలజడికలిగెను, మనంబున॥ దుః॥
(చరణము) సోదరుఁడేయిటు, వగలఁబొగల।
దురితనికరములనుసలిపి, చింతగల్గఁజేసి.
దుష్టమతిని మె! లంగుచుండెఁబోలు॥ దుఃఖముపొందఁగా॥

8. కనకసేనుఁడు:—

దునిమెనుగా। సచివవరున్, బలుఁడగు
సైనికపతిని, దురంతమే। గతిని, అయో, పోవుగా।
క్రూరుఁడే హత్యలం జేసెగా॥ దుని॥
(చరణము) శిక్షనొసఁగి యాపాపిని జెఱనుబెట్టి।
ప్రజలను సాకకున్న నిడుమల్ మూఁడుగా॥
సోదరుండని కనికరమును బ్రకటింపకుమిఁక॥ దునిమెనుగా॥

9. కమల:—క్రూరసేనుఁడు:—

కమల:—

నన్నంటఁబోకుమా। దుష్టత్వముడుగుమా॥ నన్నంట॥
(అనుపల్లవి) వదినను। తల్లినంచు నెంచుమా।
స్పృశియింపఁదగను మానుమా॥ నన్నంట॥
పరవనితలఁ బొందఁగోరఁ బాపమొదవు।
శాంతిదూలు నరకమగునుగా॥ నన్నంట॥

క్రూరసేనుఁడు:—

విరసము లేలా? సరసమువలదా? అరుదగు మాటలి వేలా?
అన్నయీాల్లె, నన్నుఁగవిసి, సుఖముఁబొంది,
రాణిఁగాగ, బ్రదుకుమా॥ విరసము॥

10. కనకసేనుఁడు:—తార:—

కనక:—

జాలిలేక, యేలమమ్ముఁ జంపఁజూచెదూ॥ జాలి॥

తార:—

వీరపాల! వేడికొందు బ్రోవుమా మమున్

కనక:—

అయ్యో! యీా కఠినత్వమిదేలా!

తార:—

సుంతయైన జాలిగల్గి, శిశువుల మముబ్రోవుమా॥

11. తార:—

ఎందు, దాగితివిసోదరా! నీ పొదుదాగితివి సోదరా॥
కోప మొదవ నన్ను వీడి యేగితే?
అయ్యో! యీాకానసమున నను దొరుకఁజూచెడిదిక్కే దీ?॥ ఎందు॥

12. జాలారి:—కమల:—

కమల:—

నన్నుఁ గదియఁబోకుమా॥ నన్ను॥
చావనుంటి విడువుమా! ఏల వార్ధినుండి తీసి యిట్లు
కోరెదవయ్యా॥ నన్ను॥

జాలారి:—

సక్కన్నిగుంటా! సేరికూకుంటా! ఎందాకుతంటా!
నన్నేఉంగుంటా॥ సక్కన్ని॥
మంచిసేపలెడ్తానే! కొత్తసాపులిత్తానే! నిన్నేలుకుంటానే॥ స॥
సంపుతావె! సరసమాడవే॥ సక్కన్ని॥

18. పుల్లి:—

ఒల్లకురా । సవతిని గట్టకురా । ఇడుముల । బెట్టకురా ।
గండము జూపకురా । ఓ బావా యిపు॥ డొల్లకురా॥
నాకు కూడు పెట్టలేవు । బట్టనొసఁగఁజాలవు నీవు ।
ఈమెను బెండ్లియాడన్ బోషింపన్ గడుకష్టము॥ ఒల్లకురా॥

పల్లిగాఁడు:—

సెప్పుతునాలేను యినవేంటె బోటి । రాణి
ఔతావు పల్లోళ్లకీవు॥ సెప్పు॥
మోజుపుట్టాగ ముద్దిసుకోవె । అడ్డుమాట లాడ నీకేల ।
నెత్తల్లు । సేపల్లు రోజు తీసుకువత్త । నాత్తిమీదన
కూకుడో॥ సెప్పు॥

కమల:—

అయ్యా! నామనవి వినగదయ్యా! నన్నోరుట తగ
దయ్యా॥ అయ్యా॥
జలములఁ బడి ప్రాణములను బాయఁజూచినట్టి నన్ను, పైకిదీసి
తేలనయ్యా?॥ అయ్యా॥
తీసి యిట్లు కోరఁదగునె? పరవనితను । మరణమునకుఁ దల
కొనెదను । బ్రతుకన విసుపుపొడమె॥ అయ్యా॥

పుల్లి:—

విడువుమురా । ఆమెను విడువుమురా । ఇదిగో నాదెబ్బా ।
యిక నీయబ్బా । వచ్చినదా సిగ్గు । నీవల్లు భగ్గు భగ్గు మని
ప్రిచ్చినది చూడు । మనసిచ్చినది । పుత్తిగట్టినదీ అగు నను
వీడకురా । సవతిని గట్టకురా । గండముఁ జూపకురా ।
ఓపల్లీ॥ విడువుమురా॥

14. విజయసింహుఁడు:—

ఆహా! ఇఁక తాళఁదగదు । ఏగనొ ప్వను॥ ఆహా॥
(అనుపల్లవి) నామిత్రుఁడైన యుగ్రుని హా । త్యనొనర్చనుగద।
వరసుగుణ వానిభార్యఁ గవియఁగఁ గ్రూరుఁడు॥ ఆహా॥
(చరణము) క్రూరుఁడాచు దురంతమే చేసెగా । సుధీనిధులనెల్ల
యమపురికంపెఁగా । ఏను సైన్యసమేతుండ నగుచుఁ బోయి ।
మిత్రరక్షణముగడంగచేసి । ధర్మదీక్షఁ బూనవలయు॥ ఆహా॥
పాపయుతము । న్యాయహరము నైన క్రూరసేను మట్టిని
గలిపెద॥ ఆహా॥

15. తార:—

జాగేలా సుగుణాలవాల ఈ యడవి నేనెటుల వసింపఁ
గలను॥ జాగేలా॥
పలువిధబాములఁ బరీక్షించెదవా । అనదనొ నను । హే
పరాత్పరా । కటకటా! కడుకష్టంబయ్యెన్ । సోదరు జాడలఁ
గాంచనోచనా॥ జాగేలా॥

16. కమల:—

పాపమా! కరుణాసాగరా! పల్కులె వినవేరా! నా॥ పాపమా॥
బాధలఁబడి నే బ్రతుకన్ వలెనా । దీనరక్ష! కృష్ణా
చూడవా । దయచిల్కవా॥ పాపమా॥
నాసుతులను నే బాసి దుఃఖముతో నేప్పుచుంటి దేవా ।
కావవా । అపచారమా । సతులనొసగి । ప్రేమతో
జాలి బ్రోవగలేవా! నా॥ పాపమా॥
జగద్రక్షకుడ వీవే కావా । కావలేవా । కృష్ణా! స్వామిపై
జాగేలనో, గరుడగమన!, నా॥ పాపమా॥

17. కనకసేనుఁడు:—

హే జగత్ప్రభూ! జగదావనా! ఈశ్వరా!
ఆఆఆఆఆఆఆ॥ హేజగత్॥
సాయమొసఁగి । మముఁజూడుముకరుణ । పావనచరణా
సుగుణాభరణ ఆఆఆఆఆఆ॥ హే జగత్॥
పసితనమున నిటు నిడుమలగుడుపఁగ । దగదు నీకు వినుత
చరిత । వరమౌనిగణనుత పదకమలయుగళ! వరదా॥ హేజగత్॥

18. కమల:—

సకల న్యాయవేత్తలారా! సాధుభావశోభితాంతఃకరణులార ।
ఓదయాళులారా॥ సకల॥
ఆఆఆఆఆ॥ సకల॥
కలుషితచిత్తుఁడు । క్రూరుఁడు నన్నవియఁజూచెగా! సాయము
నాకీయెడఁ జేయరే! వీని బారినుండి గా, పాడరే! ధర్మరక్ష
ణమునకయి పూనరే! మానము వీడరే॥ సకల॥

19. కనకసేన క్రూరసేనుల డైలాగ్:—

కనకసేనుఁడు:—

గండుతోడ నఖండవిజయము । భండనం । బున వెలయు
నటుల నీ గుండెల్ ఖండింతురా॥ గండు॥

క్రూర:—

ఛీ పో—

కనక:—

॥గండుతోడ॥

క్రూర:—

బలమెఱుఁగక నిటులఱచెదవా । యమపురి కిఁకఁ జనఁ దలచెదవా?

కనక:—

ఔరా! ఎంచేగుదున్?

క్రూర:—

ఛీ పో—

కనక:—

॥గండుతోడ॥

క్రూర:—

నీతండ్రిని । ధీ । మంతున్ మఱియెం । దఱినో పనిపితి కనవో ।
వినవో । పసితనమునఁబలిమి । గదలింతును నసువులను। ఛీపో।

కనక:—

చౌర్యంబిది కాదూ । జారత్వము కనదూ । శౌర్యంబున
నను దాకుమ ఖలమతీ॥
గండుతోడ నఖండవిజయము । భండనం । బున వెలయునటుల
నీగుండెల్ ఖండింతురా॥ గండు॥



# మా నాటక రత్నములు

# లవ—కుశ

ఆంధ్రదేశములోఁ గవుల సంఖ్య నానాఁటికిఁ బెరిగిపోవుచున్నది. ప్రకటనకర్త లెక్కువగుచున్నారు. "మంది లావయిన మఠమునకుఁ జేటు" ను సామెత మీ రెఱుంగనిదా? అసమర్థులగువారిచే వ్రాయఁబడిన వ్యర్థగ్రంథములకు దక్కువవెలకుఁ గొని, చదువఁబోయి పుటను దెఱచి, మూసివేయుట పాఠకుల కనుభవైకవేద్యమేగద! అందులకుఁ గారణము?—సరకు లేకపోవుటచేత! మా నాటక మట్టిదికాదు. పద్యములను పది పర్యాయములు-వచనమును వంద సారులు—ప్లాటును శాతికమాఱులు చదువకయే, గ్రహింపకయే, మిన్నకొన లేరు!—అనగా శైలి మనోహరము;—రత్నముల మాల—అమృతభాండము నై చుక్కలలోని చంద్రునివలె మా నాటక మితర గ్రంథములలోకెల్ల మిన్నయై చెన్నుమీఱుచున్నది. అతిశయోక్తి కాదు. అసత్యము లేదు. చాకలవారి సంభాషణము విన్నంతనే కడుపులు చేతఁబట్టుకొని నవ్వనివారుగాని, సీతావియోగమునఁ బరితపించు రామునితోఁ బాటు కన్నీరు విడవనివారుగాని పందెమునకయినఁ గనఁబడరు. ఆత్మస్తుతి గాకున్న—సుప్రసిద్ధము! నేఁడే పుస్తకమును దెప్పించుకొని చదవి, ఆనందింపుఁడు.

వెల **0—12—0**

వలయువారు:—


కాళహస్తి తమ్మారావు అండ్‌సన్సు,

పబ్లిషర్సు అండ్ బుక్‌సెల్లర్సు,

రాజమండ్రి.

# శ్రీకృష్ణ తులాభారము

శ్రీకృష్ణుని దూచిన తులఁతో మా యీ నాటకరాజముం దూచినచో నితరనాటకములు — నాఁటి రుక్మిణీదేవికొఱకు దేవులాడవలసినదే! సత్యభామకు గర్వభంగము గలుగఁజేయుటకుఁ గలహాశనుం డగు నారదుండు పన్నిన తంత్ర మితివృత్తము! ఐహికమగు ప్రణయముకన్న నాముష్మికమగు భక్తివైపునకే ములుసూపు నని రుక్మిణీదేవి యెఱిఁగించినది—సత్యభామయొక్క సంపదకుఁ దూఁగని కృష్ణుఁడు—రుక్మిణియొక్క తులసిదళమునకు లేచినాఁడు! నాటకమున రక్తి! అందులో భక్తి! దానివలన ముక్తి! మరల మరలఁ జదువవలె నన్న యాసక్తి!! కృష్ణుని విక్రయింపఁజూపునపుడు నారదుఁడు చదువు పద్యములు మీ పిల్లల మాటలవలె ముద్దుగను—ప్రియురాండ్ర అధరసుధారసముపగిది హితవుగను—మధురముగను ఉండును. చదివి యిందలి నిజముం గనుఁగొనుఁడు. వెల

# శ్రీకృష్ణ రాయబారము

కురుపాండవ సంగ్రామమున కారంభమునఁ బాండవులపంపున జగన్నాటక సూత్రధారుం డగు కృష్ణుఁడు పాండవులకు సంధిఁ గూర్ప యత్నించిన కథాభాగ మితివృత్తము—నాటకము నవరసభరితము—పద్యములు హృద్యములు—గద్యము లనవద్యములు—కథాసంవిధాన మత్యద్భుతము—భీమార్జునుల రౌద్రము—ధర్మజుని శాంతము—ద్రౌపది యవమానము—కృష్ణుని వాక్చాతుర్యము—కర్ణుని త్యాగము—కుంతియొక్క సంకుచితభావము. చక్కఁగా, సరసముగాఁ, దేనెలూరు తేఁటతెనుఁగు కైతలోఁ, జిత్రింపఁబడినవి. కర్ణాశ్వత్థామలు తమలోఁ దాము పోరాడుకొనునప్పటి ఘట్టము హృదయమును కంపింపఁజేయును. నేఁడే కార్డు వ్రాయుఁడు! ఆలసించిన యాశాభంగము!! వెల

# శ్రీకృష్ణ లీల!

ఏ మహామహుఁడు బ్రహ్మాండ భాండోదరుఁడై, చిన్నతనానఁ దల్లి యగు యశోదాదేవికి వానిని వ్యక్తపఱచెనో, ఏ పుణ్యపురుషుఁడు గజ్జెల మ్రోఁత ఘల్లు మనునట్లు ఫణిఫణాగ్రమునఁ జిందులాడెనో, ఏ జగన్నాటకసూత్రధారుఁడు పదియాఱువేల గోపికల మోహింపఁజేసెనో—అట్టి శ్రీకృష్ణుని దివ్యలీలలు బాల్యలీలలు! దేవకీ వసుదేవుల దీనావస్థ-కంసుని క్రూరత-కృష్ణుని జన్మము మున్నగు కథాభాగములు రమ్యముగ వర్ణింపఁబడినవి. కృష్ణుని కొంటెతనము-యశోదాదేవియొక్క పెంపుడుప్రేమ-కంసుని దుంతగము-అక్రూరుని భక్తి మున్నగునవి చదివితీరవలెను. పుణ్యమునకుఁ బుణ్యము-ఆనందమున కానందము-వేలకొలంది ప్రతులు ఖర్చయినవి! అసంఖ్యాకములగు నాటకసమాజములవా రాదరించిరి. వెల |

# పద్మవ్యూహము

అర్జునునకు సుభద్రాదేవియందు జనించిన అభిమన్యుఁడు! వీరాభిమన్యుఁడు! "అత్త", "అమ్మ" యనునాఁడే అరి మారణోపాయ హేతుభూత ప్రసంగములు సలిపి, అడుగు లిడ నేర్చిననాఁడే శత్రురాజన్య మస్తక సందోహములఁ జిందులాడి, కురుపాండవ సంగ్రామమునఁ గీర్తిశీయాగ్రణియై, అత్యద్భుత ధైర్యశౌర్య స్థైర్యసాహసౌదార్యములఁ బ్రచురించి, ద్రోణాదుల దల్లడిల్లఁ జేసినాఁడు! అట్టివాని వీరకథయే యిందుఁ జక్కఁగా నాటకరూపమున వ్రాయఁబడినది! పలుసారులు ప్రదర్శింపఁబడినది. వేనవేలు ప్రజలు చదివి శ్లాఘించినది! మీరు మాత్రము మిస్సకుందు రేల? ఇపుడే యొక ప్రతిని దెప్పించుకొనుఁడు.

వెల |

# బొబ్బిలి

ఆంధ్ర శౌర్య ధైర్య స్థైర్య గాంభీర్యాదులఁ బ్రతిఫలింపఁజేయు నిద్దంపు టద్దమనందగు నీ నాటకరాజ మాంధ్రలోకమునం గల గ్రంథములలోఁ దలమానికమువంటిది. బొబ్బిలి బెబ్బులి యగు పాపారాయుని శౌర్య మనివార్యము; భాషణములు భీషణములు!—రంగారావు వెంగలరాయ మున్నగు వీరాగ్రణులు ప్రాణముకంటె మానమే యధికమని యెంచి, ఘోరాసులం జేఁబూని యుద్ధరంగముల నిద్ధప్రతాపంబు వ్యక్తపఱచి, ప్రత్యర్థితండంబులఁ జెండాడి వీరస్వర్గ మలంకరించిన విషాదగాథ యీందు విస్పష్టముగా వర్ణింపఁబడినది. మఱుగుపడిన యాంధ్రప్రతాపంబును..ఆంధ్రశౌర్యాగ్నిని బ్రకటించి నేఁటికిని "బొబ్బిలి మట్టిఁ ద్రొక్కిన బెబ్బులి యగుదుర" ను సూక్తిని బాదుకొల్పి, వీరగాథ విషాదాంతమై, ఒడలు పులకరింపఁజేయు కథాసంవిధానముతో—గుండెలఁ దద్దరిల్లఁజేయు పద్యములతో, భయానక సంఘట్టనలతో, విస్ఫులింగముల వెలిగ్రక్కు గద్యములతో వెలుగొందు నీ నాటకరాజమును నేఁడే చదువుఁడు.

వెల

వలయువారు:—

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు,

రాజమండ్రి.